# మానవ సేవ మాధవ సేవ





mohan PUBLICATIONS
ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

ప్రథమ ముద్రణ:
శ్రీముఖ నామ సంవత్సరము
ఆశ్వీజమాసము
సెప్టెంబర్-1993

ప్రచురణ:
నవభారతి ప్రచురణలు
3-4-852, బర్కత్‌పురా
హైదరాబాద్ - 500 027.

టైటిల్ ముద్రణ:
కళాజ్యోతి ప్రాసెస్ ప్రై.లిమిటెడ్
ముషీరాబాద్
హైదరాబాద్ - 500 020

ముద్రణ:
భారతీ ఆర్ట్ ప్రింటర్స్
చిక్కడపల్లి
హైదరాబాద్

కంపోజింగ్:
జాగృతి గ్రాఫిక్స్
నారాయణగూడ
హైదరాబాద్-500 029.

ప్రతులకు:
సాహిత్య నికేతన్
బర్కత్‌పురా
హైదరాబాద్-500 027.
సాహిత్య నికేతన్
ఏలూరురోడ్,
విజయవాడ-520 002.

వెల: రూ. 5.00

# ముందుమాట

వంద సంవత్సరాల క్రితం స్వామి వివేకానంద చికాగో సర్వమత సమ్మేళనంలో పాల్గొని హిందూ ఆధ్యాత్మికత యొక్క విజయ ధ్వజాన్ని పాశ్చాత్యదేశాలలో ఎగురవేశారు. అంతవరకు సనాతనధర్మం పట్ల సదవగాహనలేని పాశ్చాత్యులు భారతీయ ఆధ్యాత్మికత నుండి స్ఫూర్తిని పొందసాగారు. వారి ఆదరణను చూసి భారతీయులూ ఆత్మవిశ్వాసాన్ని, ఆత్మగౌరవాన్ని అలవరుచుకున్నారు. స్వామివివేకానంద ప్రత్యక్షంగా భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనలేక పోయినా, స్వాతంత్ర్యోద్యమంలోని వివిధ వర్గాల వారిపై ఆయన ప్రభావం ఉంది.

కాంగ్రెసుపార్టీలోని మితవాదులు, అతివాదులు, విప్లవవీరులతో సహా వివేకానందుని స్మరించినవారే. స్ఫూర్తిని పొందిన వారే. వివేకానంద రచనలు యువతలో త్యాగ,సేవా భావనలను దేశభక్తిని నింపి సామాజికసేవ పట్ల ఆసక్తిని పెంచి కార్యోన్ముఖులుగా చేస్తున్నాయి. అందువలన యువతకు ప్రేరణదాయకంగా, దిగ్విజయ శతాబ్ది సందర్భంగా ఈ చిన్నపుస్తకాన్ని మీ చేతులలో ఉంచుతున్నాం.

ఈ వ్యాస సంకలనంలోని అంశాలన్నింటినీ 'వివేకానంద రచనల సమగ్ర సంపుటాలు' (కంప్లీట్ వర్క్స్ ఆఫ్ స్వామి వివేకానంద) నుండి ఉద్ధృతము.

సెప్టెంబరు, 11, 1993 — ప్రకాశకులు
హైదరాబాదు.

# మానవసేవే - మాధవసేవ



న కామయే గతి మీశ్వరాత్ పరాం
అష్టర్ధి యుక్తా మపునర్భవం వా
ఆర్తిం ప్రపద్యే ఖిల దుఃఖభాజాం
అంతఃస్థితో యేన భవన్త్య దుఃఖాః

అష్టసిద్ధులతో కూడిన పరమేశ్వరపదం నాకక్కరలేదు. మోక్షమును కూడా వేమ కోరను. దుఃఖంతో బాధపడే అసంఖ్యాక ప్రజల హృదయాలలో జొరబడి, వారి ఆర్తిని తొలగించడమే నా కోరిక

రంతిదేవుడు-భాగవతం 9-12-21

హిందూజాతికి పునరుజ్జీవింప చేయాలనే దృష్టితో మన ధర్మాన్ని సంస్కరించాలని అంటే తల్లక్రిందులుగా మార్చాలని కోరే సంస్కర్తలు కొందరు మనలో ఉన్నారు. అలాంటి వారిలో సవ్యంగా ఆలోచించే వాళ్లూ కొందరు లేకపోలేదు. కాని ఇతరులను గ్రుడ్డిగా అనుకరిస్తూ, తాము ఏమి చేస్తున్నారో తెలియకుండా మూఢంగా వ్యవహరిచే వాళ్ళూ ఉన్నారు.

అలాంటి వాళ్ళందరికీ అపజయమే ఎదురైంది. అసలు రహస్యం వాళ్ళు తెలుసుకోలేదు. నేర్చుకోవలసిన గొప్ప గుణపాఠాన్ని నేర్చుకోలేదు. తొందరపాటుతో, మన సమాజంలో కన్పించే దోషాలన్నిటికీ ధర్మమే కారణమన్నారు. అదేదో కథలో చెప్పినట్లు, స్నేహితుని ముక్కుమీద వాలిన దోమను చంపడానికి, మిత్రుణ్ణీ, దోమనూ చంపగలంత పిడిగ్రుద్దుల వర్షం కురిపించినట్లున్నది. కాని ఈ విషయంలో మాత్రం అభేద్యమై కొండను ఢీకొని, ఆ ఎదురు దెబ్బకు నిల్వలేక నామరూపాలు లేకుండా పోయినారు. తప్పుదారినైనా కృషిచేసి విఫలులైన ఆ ఉదాత్త నిస్వార్థ మూర్తులు కూడా కీర్తిమంతులే. నిద్రాణమైన ఈ అజగరాన్ని మేలుకొల్పడానికి అలాంటి కుదుపులు అవసరమైనాయి. కానీ అవన్నీ వినాశకాలే గాని, నిర్మాణదాయకాలు కావు. అవి క్షణికాలు కనుకనే అణగారి పోయాయి.

## నిర్మాణ గుణాత్మక పద్ధతి:

కేవలం అలా ఆక్షేపించే ఏ సంస్థలోనూ నేను చేరలేను. అసలు విమర్శ దేనికి? ప్రతి సమాజములో దోషములున్నవని అందరికీ తెలుసు. ఈనాడు ప్రతి పసిపాప కూడా వేదికమీద నిల్చుని హిందూ సమాజంలో ఉన్న భయంకర దోషాలను గురించి పెద్ద ఉపన్యాసమీయగలదు. చదువు సంధ్యలు లేని ప్రతి విదేశీయుడు లోక దిమ్మరిగా తిరుగుతూ, రైలులో ప్రయాణిస్తూ కిటికీ లోంచి అలవోకగా చూచి అంతాగ్రహించినట్లు భారతదేశంలోని భయంకర దోషాలను గురించి పండితుని వలె ఉపన్యసించగలడు. మన సంఘములో దోషాలున్నవని మనము అంగీకరిస్తూనే ఉన్నాము. తప్పులెవరైనా ఎన్నవచ్చు. కాని ఆ దోషాలనుండి తరించేమార్గం చూపగలవాడే మానవజాతికి మిత్రుడు. నీళ్ళలో మునుగుతూన్న ఒక పసివానికి ఒక వేదాంతి ఉపన్యసిస్తున్నాడట. ఆ పసివాడు నీళ్ళలో మునుగుతూ "అయ్యా ముందు నన్ను బైటకు తీయండి" అని ప్రాధేయపడుతున్నాడు. మన ప్రజలు కూడా అలాగే ఎలుగెత్తి అడుగుతున్నారు. ఉపన్యాసాలు ఇకచాలు, సంస్థలుచాలు, పత్రికలు చాలు. మమ్మల్ని కడతేర్చడానికి చేయూత ఈయగల వ్యక్తి లేడు? మమ్మల్ని నిజంగా ప్రేమించే వ్యక్తి ఎక్కడైనా ఉన్నాడా? మేమంటే సానుభూతి గల వ్యక్తి ఉన్నాడా? ఆ మనిషే నేడవసరము. ఈ సంస్కరణోద్యమాలతో ఇదే నాకున్న అభిప్రాయ భేదము.

అందరికన్నా నేనే ఉత్తమ సంస్కర్తనని ఆ సంస్కర్తలందరికీ చాటదలచుకున్నాను. వాళ్ళకు పైపై సంస్కరణలు కావాలి. నాకు పునాదులనుంచి సంస్కరణ కావాలి. పద్ధతులలో మనకు భేదం ఉన్నది. వాళ్ళది విధ్వంసక విధానం. నాది నిర్మాణ విధానం. నాకు సంస్కరణ మీద విశ్వాసం లేదు. నేను వికాసాన్ని విశ్వసిస్తాను. పరమేశ్వరుని స్థానంలో నన్ను నిలుపుకొని, మన సమాజాన్ని "నీవిలా నడువు - అలాకాదు" అని శాసించే సాహసం చేయను. రాముడు వారధి నిర్మించేటప్పుడు, అతి అల్పమైన తనవంతుగా ఇసుకను రాల్చిన ఉడతభక్తినాది. అదీ నా స్థాయి.

భారతదేశంలో సంస్కర్తలు కొరవైనారా? నీవు భారత చరిత్ర చదివినావా? రామానుజుడెవరు? శంకరుడెవరు? నానక్ ఎవరు?

చైతన్యుడు ఎవరు? కబీరెవరు? దాదూ ఎవరు? ఒకరి వెంట ఒకరుగా మహోన్నతమైన నక్షత్రగణములా అవతరించిన ఈ ఉత్తమ ప్రబోధకులెవరు? నిమ్న తరగతుల వారికై రామానుజుడు తపించలేదా? తన శిష్యగణంలో అస్పృశ్యులను కూడా చేర్చుకోడానికి యావజ్జీవితం ప్రయత్నించలేదా? మహమ్మదీయులను కూడా తన పంచన చేర్చుకోడానికి ఆయన శ్రమించలేదా? హిందూ - మహమ్మదీయులతో సంప్రదించి, ఒక నూతన వాతావరణాన్ని తీసుకుని రావడానికి గురునానక్ ప్రయత్నించలేదా? వారందరూ శ్రమించిన వారే. ఆ శ్రమ ఇంకా కొనసాగుతూనే ఉన్నది. భేదం ఒక్కటే. నేటి సంస్కరణల ఆడంబరం వారిలో లేదు. ఈనాటి సంస్కర్తలలా వారికి శపించడం తెలియదు. ఆశీర్వదించడమే వారికి తెలుసు. వారు ఎప్పుడూ దూషించలేదు. జాతి వికాసం చెందాలనే వారు నిరంతరం ఉద్బోధించారు. గతాన్ని పరికించి "ఓ హిందువులారా! మీరింత వరకూ మేలే చేసారు. కాని సోదరులారా! మనం ఇంకా ఉత్తమ స్థితిని సాధించాలి" అని ప్రబోధించారు. ఉన్న భేదమంతా అక్కడే. మన స్వభావాన్ని అనుసరించి మనం వికసించాలి. విదేశీయులు నెత్తిన రుద్దిన పద్ధతుల ననుకరించడం వల్ల లాభం లేదు. దానివల్ల సాధించగలిగింది లేదు. ఇతర జాతుల మూసలో మనను కరగపోసి, విరిచి, హింసించడానికి జరిగిన ప్రయత్నాలు అసాధ్యములైనాయి. దీనికి పరమేశ్వరుని మహిమే కారణం. ఇతర జాతుల సంస్థలను నేను విమర్శించను. వాళ్ళ వరకు అవి మంచివే. కాని వాటి అవసరం మనకు లేదు. వారికి పథ్యమైనవి మనకు విషం కావచ్చు. మనం నేర్వవలసిన మొదటి పాఠమిది. వారి వారి శాస్త్రముల, సంస్థల, సంప్రదాయాల నేపథ్యంతో వారికి నేటి వ్యవస్థ లభించింది. మన పరంపరతో, వేల సంవత్సరాల కర్మలనేపథ్యంతో, మన ప్రమాణపు మొగ్గ మనదిగా మన పద్ధతులను మనం నడుపుకుంటాం. అదీ మనం చేయవలసింది.

## జ్యోతిని తీసుకొనిరా! చీకటి అంతరిస్తుంది:

నేను భారతీయులకు పదే పదే చెప్పినట్లుగా, చీకటి గదిలోకి ప్రవేశించి "చీకటి - చీకటి" అని ఆక్రోశిస్తే చీకటి తొలగి పోతుందా? దీపాన్ని తీసుకొని రండి! చీకటి సహజంగా అంతరిస్తుంది. ఇదీ సంస్కరణలకు పూనుకునే

వ్యక్తుల మర్మం. ప్రజలకు ఉత్తమ విషయాలను తెలుపండి. ముందుగా మనిషిని విశ్వసించండి. మనిషి పతనం చెందాడనీ, అధోగతి పాలైనాడనీ ప్రారంభించడం దేనికి? ఎంత అధమస్థితిలో ఉన్న మనిషైనా సరే అతని పట్ల నాకున్న విశ్వాసంలో అణుమాత్రం లోపించదు. మొదట పరిణామం ఆశాజనకంగా కన్పించకపోయినా, నేను ఏ మనిషిని విశ్వసించినా, చివరకు నా విశ్వాసానికి విజయమే లభించింది. మహా విద్వాంసునిగా కన్పించినా అత్యంత మూఢుడుగా కన్పించినా, ముందు ఆ మనిషిని విశ్వసించండి. సాక్షాత్తూ దేవుడైనా - దయ్యమైనా మొదట ఆమనిషిని విశ్వసించాలి. ఆ విశ్వాసంతో అతనిలో పొరపాటు కన్పించినా, అతడు తప్పులు చేసినా ఘోరాతి ఘోరమైన సిద్ధాంతాలను నమ్మిన వాడైనా సరే, అవి అతని సహజ స్వభావంలో పుట్టినవి కావనీ, ఉదాత్త ఆదర్శం లోపించడమే కారణమని నమ్మండి. సరియైన మార్గం లభించక పోవడం వల్లనే మనిషి తప్పుదారి పడుతున్నాడు. కనుక దోషాన్ని పరిహరించే మార్గం సత్యాన్ని ఉద్బోధించడమే. ఆ పని చేయండి. అతణ్ణి పోల్చుకోనీయండి. నీవతనికి సత్యాన్ని బోధించు. అంతటితో నీపని ముగిసినట్లే. లోలోపల తనకు తెలిసిన దానితో నీవు తెలిపిన దాన్ని పోల్చుకోనివ్వు. నీవు నిజంగానే అతనికి సత్యాన్ని తెలిపితే, అసత్యం తొలగక తప్పదు. సత్యము మంచిని తప్పక వెలువరిస్తుంది. ఆధ్యాత్మికంగా దేశాన్ని సంస్కరించాలంటే మార్గం ఇదే. పోరాడడంకాదు. తప్పు చేస్తున్నారని ఇతరులను ఆడిపోసుకోడం కాదు. మంచిని ప్రజలముందు ఉంచండి. ఎంత ఆసక్తితో ప్రజలు దాన్ని గ్రహిస్తారో గమనించండి. దైవత్వం ఎన్నడూ మరణించదని గుర్తించండి. అదెప్పుడూ మానవునిలో సజీవంగానే ఉండి, మేల్కొని, మంచి కొరకు ఉదాత్తత కొరకు అర్రులు చాచుతుంటుంది.

## సత్యాన్ని పట్టుకొని నిలవండి:

భారతదేశంలో మన దారిలో రెండు పెద్ద అడ్డంకులున్నాయి. ఒకటి పురాతన ఛాందసత్వం, రెండవది ఆధునిక యూరోపీయ నాగరికత. ఈ రెంటిలో నేను పురాతన ఛాందసత్వాన్నే వరిస్తాను. ఆధునిక యూరోపీయ నాగరికతను కాదు. ఎందుకంటే ఛాందసవాది మూఢుడైతే కావచ్చు, మోటు వాడు కావచ్చు. కాని అతడు మనిషి అటువికో విశ్వాసం

ఉన్నది. అతనికి శక్తి ఉన్నది. తన కాళ్ళమీద తాను నిల్చుంటాడు. అదే యూరోపీయ నాకగరికునికి వెన్నెముక ఉండదు. ఒక పద్ధతంటూ లేకుండా అక్కడా ఇక్కడా ప్రోగుచేసుకున్న భావాలముద్ద అతడు. ఈ భావాలు జీర్ణం కానివి. సమన్వయం సాధించుకోనివి. సమరసాన్ని ఘటించుకోనివి. అతడు తన కాళ్ళమీద తాను నిల్చోలేడు. అతని తల తిరుగుతుంటుంది. అతని పనులకు ప్రేరణ ఏది? ఆంగ్లేయులు భళీ అని వెన్ను జరచడమే. అతని సంస్కరణలకు గాని, సాంఘిక ఆచారాలను నిశితంగా విమర్శిస్తుండడానికి గాని ప్రేరణ యూరోపీయుల మెప్పుకోలే. మన ఆచారాలలో కొన్నింటిని దురాచారాలనడానికి కారణం ఏమిటి? యూరోపీయులు అలా అంటున్నారు గనుక. అదే అతను చూపే కారణం. నేనా కారణానికి తల దించను. నిల్చో! నీ శక్తితో నీవు మరణాన్ని వరించు. ప్రపంచంలో పాపమంటూ ఏదైనా ఉంటే, అది ఒక్క బలహీనతే. బలహీనత పాపం, బలహీనతే మృత్యువు. కనుక అన్ని బలహీనతలను తొలగించుకోండి.

ఒక సుందరమైన అధిష్ఠానం. అతి ప్రాచీనమైన వైభవస్మృతికి చిహ్నం. విస్మృతివల్ల, ఉపయోగంలో లేనందువల్ల, జీర్ణావస్థలో ఉన్నది. దానిపై దుమ్ము, ధూళి ప్రతిచోటా పేరుకొని ఉండవచ్చు. కొన్ని భాగాలు వేలకొరిగి పోతూండవచ్చు. మరి నీ కర్తవ్యం ఏమిటి? అవసరమైన మేరకు శుభ్రపరచి, పునర్నిర్మించి, గతాన్ని పునరుద్ధరిస్తావా లేక ఆ పూర్తి భవనాన్ని నేలకూల్చి, దాని స్థానంలో ఇదమిత్థం అని తుది రూపం ఇంకా ఏర్పడని అస్థిరమైన ఆధునిక నిర్మాణాన్ని చేయడానికి పూనుకుంటావా? సంస్కరించడం అవసరమే. సర్వనాశనం చేసికాదు. అవసరమైన విధంగా దులిపి, మరమ్మతులు చేసి, పునరుపయోగానికి ఆయత్తపరచాలి.

నేను క్షణికమైన సంఘసంస్కరణలను బోధించే ప్రచారకుణ్ణి కాను. దోషాలను చక్కదిద్దడానికి నేను పూనుకోడం లేదు. మానవ వికాసానికి, నిర్దుష్టంగా మన పూర్వులు నిర్దేశించిన ప్రణాళికను పూర్తిగా సాక్షాత్కరించుకోడానికి పురోగమించండని మిమ్మల్ని కోరుతున్నాను. మానవుని సమగ్రతనూ అతనిలో స్వభావజన్యమైన దైవ ప్రవృత్తిని బోధించే వేదాంత లక్ష్యాన్ని ఆఖిలంఘికంగా సాధించడానికి కృషి చేయండని మాత్రమే మిమ్మల్ని

కోరుతున్నాను.

మన పూర్వులు ఏ సాక్షాత్కారం పొంది "ఏకం సద్విప్రా బహుధా వదంతి" అని సంబోధించారో, ఆ సాక్షాత్కారం తన అనంత ప్రేమతో మన నావేశించుగాక! మనపై, ఆశీస్సులను వర్షించుగాక! మనం పరస్పరం అవగాహన చేసుకొనేట్లు చేయుగాక! మనం నిజమైన ప్రేమతో సత్యంపట్ల గాఢమైన అనురాగంతో ఒకరికొకరను ప్రేమతో కష్టించేట్లు చేయుగాక! వ్యక్తిగత కీర్తివాంఛ, వ్యక్తిగత ప్రతిష్ఠాభిలాష, వ్యక్తిగత లాభం ఈ ఆధ్యాత్మిక పునర్జాగరణ మహాకార్యంలో ప్రవేశించనీయకుండుగాక!

# దేవునిలో ప్రేమను, మనిషిలో దేవుణ్ణి దర్శించు:

## శివసంతానాన్ని జాగ్రత్తగా చూసుకో!

పూర్వం ఒక సూఫీకవి ఉండేవాడు. అతను వ్రాసిన ఒక కవితకు సారాంశమిది. "నేను ఆ ప్రేమమూర్తి దగ్గరకు వెళ్ళాను. తలుపులు మూసి ఉన్నాయి. నేను తలుపు తట్టాను. "ఎవరు నీవు?" అని లోనుండి ప్రశ్న వినిపించింది. "నేనే" అన్నాను. తలుపులు తెరుచుకోలేదు. నేను మళ్ళీ రెండోసారి తలుపుతట్టాను. మళ్ళీ లోపలినుండి "ఎవరు?" అని ప్రశ్న. "నేను ఫలానా" తలుపు తెరుచుకోలేదు. మళ్ళీ మూడోసారి తలుపు తడితే, అదే ధ్వని "ఎవరు నీవు" అని మళ్ళీ ప్రశ్నించింది. "ప్రియతమా! నేను నీవే" అన్నాను" తలుపు తెరుచుకుంది.

నిర్మలంగా ఉంటూ ఇతరులకు సేవ చేయడమే అన్ని పూజలకు సారాంశం. పేదలలో, బలహీనులలో, రోగులలో, శివుని సాక్షాత్కరించుకునే వాడే నిజమైన శివపూజకుడు. విగ్రహంలో మాత్రమే శివుడున్నాడనుకునే వాడు ప్రాథమిక దశలో ఉన్నవాడే. శివుని గుడిలో విగ్రహరూపంలో చూచేవానికన్నా, కుల, వర్ణ, జాతి మొదలైన వివక్షలు లేకుండా కేవలం ఒకే ఒక్క పేదవానికైనా సహాయం చేసి, సేవ చేసినవాడే పరమేశ్వరునికి అధిక ప్రేమ పాత్రుడు.

ఒక ధనికునికి ఒక తోట, ఇద్దరు పనిమనుషులుండేవారు. అందులో ఒకడు పరమసోమరి, అసలు పనే చేయకపోయేవాడు. కాని యజమాని తోటలోకి వచ్చినప్పుడల్లా, లేచి, చేతులు జోడించి "అహో! ఏమి మీ ముఖ కాంతి" అని ఆయనముందు గెంతుతుండేవాడు. రెండో పనిమనిషి అధిక ప్రసంగం లేకుండా కష్టించి పనిచేసి, రకరకాల కూరలు, పండ్లు పండించి, అక్కడికి చాలా దూరంలో ఉన్న యజమాని ఇంటికి బుట్టలో మోసుకొని పోయి ఇస్తుండేవాడు. ఈ ఇద్దరిలో యజమానికి ఎవరిపట్ల ప్రేమ ఎక్కువగా ఉంటుంది? పరమేశ్వరుడు ఆ యజమానిలాంటివాడు. ఈ ప్రపంచ మాయన ఉద్యానవనం. ఇక్కడా రెండు రకాల తోటమాలీలున్నారు. ఒకడు సోమరి, కుత్సితుడు, పనిచేయడు, కాని పరమేశ్వరుని కనుల సోయగాన్ని, ముక్కు తీరును, మిగతా కవళికలను పొగడుతుంటాడు. రెండోవాడు పరమేశ్వరుని సంతానాన్ని, పేదలను బలహీనులను, సమస్త జంతువులను, ఆయన సృష్టి సర్వస్వాన్ని సేవిస్తుంటాడు. వీరిలో పరమ శివునికి ప్రీతిపాత్రుడెవడు? ఆయన సంతానానికి సేవ చేసినవాడే కదా! తండ్రిని సేవించాలంటే, ముందు ఆయన సంతానానికి సేవచేయాలి. పరమ శివుని సేవించాలంటే, ఆయన సంతతిని ఈ ప్రపంచంలోని సర్వప్రాణులను ముందుగా సేవించాలి. పరమేశ్వరుని దాసానుదాసులే ఆయనకు పరమ సేవకులు. అని శాస్త్రాలు, ఘోషిస్తున్నాయి. దీనిని గుర్తుంచుకోవాలి.

మొదట మనను గురించి ఆలోచించుకోవాలి. స్వార్థ చింతన పరమ పాపం. "నేను మొదట తింటాను. ఇతరుల కంటే ఎక్కువ ధనాన్ని పొందుతాను, నేను సర్వస్వాన్ని స్వాధీనం చేసుకుంటాను" అని భావించేవారు, "అందరికంటే ముందు నేను స్వర్గానికి వెళ్తాను, అందరి కంటె ముందు నేను మోక్షాన్ని పొందుతాను" అనుకునేవాడు స్వార్థుడు. నిస్వార్థుడెప్పుడూ "నేను చిట్టచివరివాణ్ణి నాకు స్వర్గానికి పోవాలని లేదు. నా సోదరులను సేవించ గలగడానికి, నరకానికైనా వెళ్తాను" అని భావిస్తాడు. ఈ నిస్వార్థ ప్రవృత్తే ధర్మానికి గీటురాయి. ఈ నిస్వార్థ వృత్తి ఎంత ఎక్కువగా ఉంటే, అంత పరమేశ్వరునికి చేరువలో ఉంటారు. స్వయంగా ఏమి తెలిసినా, ఏమి తెలియకున్నా, విద్వాంసుడైనా, అజ్ఞాని

అయినా, అట్టి వ్యక్తే పరమేశ్వరునికి సన్నిహితుడు.. స్వార్థుడు ఎన్ని గుళ్ళు దర్శించినా, ఎన్ని తీర్థాలు సేవించినా, ఎన్ని చిరుతపులి వేషాలు వేసినా, పరమేశ్వరునికి దూరంగానే ఉంటాడు.

## ప్రతిమనిషిలో పరమేశ్వరుడున్నాడు:

ఆధ్యాత్మిక జిజ్ఞాసమోతాదును కొంత తగ్గించి, వేదాంతాన్ని ఈ భౌతిక జగత్తుస్థాయికి రప్పించాలని మాత్రమే మనం చేస్తున్నపని. మొదట భుక్తి- తర్వాత ముక్తి. ఆకలికి అలమటిస్తున్న వాని కడుపును భక్తితో కూరాలని ఒక మోతాదును ఎక్కువగా దట్టిస్తున్నాం. ఆకలికి అలమటించే వానికి సిద్ధాంతము తృప్తినీయదు. మనకు రెండు శాపాలున్నాయి. ఒకటి మన బలహీనత, రెండోది ద్వేషం. మన గుండెలు ఎండిపోయాయి. లక్షలాదికి మీరు సిద్ధాంతాలు బోధించవచ్చు. మీ సంప్రదాయంలో లక్షలాది భక్తులుండవచ్చు. స్పందించే హృదయాలు లేనప్పుడు అవన్నీ వృధా. మీ వేదాలు బోధించిన విధంగా, వారికై తపించండి. మీరు - వాళ్ళూ, పేదలు - ధనికులు, సాధువులూ - పాపులూ అందరూ బ్రహ్మమనే ఆ ఒకే ఒక అనంత తత్వంలోని భాగాలని మీ వేదాలు ప్రవచించిన విధంగా అనుభూతిని పొందేదాకా అందరి కొరకు తపించండి.

ప్రతి పురుషుణ్ణి, స్త్రీని, ప్రతి వ్యక్తిని పరమేశ్వరునిగా దర్శించండి. నీవు ఎవరికీ సహాయ పడలేవు. నీవు చేయగలిగింది కేవలం సేవ చేయడమే. నీకు అవకాశమే లభిస్తే పరమేశ్వరుని సంతానాన్ని సేవించు. పరమేశ్వరుని సేవించు. తన బిడ్డలలో ఎవరికైనా సహాయ పడగల అవకాశమే గనుక పరమేశ్వరుడు నీకు ఇస్తే, నీ జన్మ ధన్యమైనట్లే. నిన్ను గురించి గొప్పగా భావించకు. ఇతరులకు లేని అవకాశం నీకు లభించినందుకు నీవు ధన్యుడివి. సేవను ఒక ఆరాధనగా చేయి. పేదలలో పరమేశ్వరుని చూడగలగాలి. వారిని సమీపించి ఆరాధించడం తన ముక్తికొరకే. పేదలు - అభాగ్యులు ఉన్నారంటే మనను తరింపచేయడానికే. రోగుల రూపంలో, ఉన్మాదులుగా కుష్ఠురోగుల వలె, పాపులుగా పరమేశ్వరుడు వస్తాడు. నా మాటలు సాహసంతో కూడినవే. ఇన్ని రూపాలలో పరమేశ్వరుని సేవించే అవకాశం లభింప చేయడం మన పరమ అదృష్టమని భావించండి. ఇతరులను

శాసించడం ద్వారా ఏదో మేలు చేయవచ్చుననే ఊహను త్యజించండి. ఒక మొక్క ఎదగడానికి నీవు చేయగలిగినంతే చేయగలవు. మట్టి సమకూర్చి, దానికి కావలసిన నీరూ, గాలి యివ్వగలవు. తన స్వభావాన్ని బట్టి మొక్క కవసరమైనంత స్వీకరించి, జీర్ణించుకొని, తన ప్రకృతిని బట్టి ఎదుగుతుంది.

మన సోదరులను మేలు చేయండని ఇప్పుడే ఇక్కడ ప్రవచించారు. ఎందుకంటే చెడు చేస్తే అది కర్తకే ఎదురు తిరుగుతుంది. మానవుడు దైవస్వరూపుడని, కనుక మానవునికి హాని చేయరాదని, అతనిలో ఉన్న దైవత్వానికి హాని చేయరాదని ప్రతి సంప్రదాయము, ప్రతి మార్గము విశ్వసిస్తాయి. కనుక పరమేశ్వరుడే సమస్త విశ్వానికి తండ్రి అని, మనం నమ్మినా నమ్మకున్నా మన సోదరుని ప్రేమించ వలసిందే.

ప్రజలకు భావాలను ఇవ్వండి. మీరు చేయగల సహకార మదొక్కటే. ఫలితం సహజంగా అనుగమిస్తుంది. రసాయనాలను ఒకచోట చేర్చడమే మన పని. మిగతా ప్రక్రియ ప్రకృతి నియమాన్ననుసరించి జరుగుతుంది. తలలోకి భావనలు జొప్పించడం మన పని. మిగతావి అవే సాధిస్తాయి. భారతదేశంలో నేడు చేయవలసిన పని ఇదే.

## దరిద్రదేవో భవ:

సాధారణ సన్యాసి సంసారాన్ని త్యజించి, బైటకు పోయి పరమేశ్వరుని ధ్యానిస్తాడు. నిజమయిన సన్యాసి ప్రపంచంలోనే జీవిస్తాడు. కాని దానితో పెనవేసుకొని పోడు. అడవుల్లో నివసిస్తూ తీరని కోరికలను నెమరు వేసుకుంటూ ఆత్మను నిరాకరించే వ్యక్తులు నిజమైన సన్యాసులు కారు. జీవన యుద్ధంలో మధ్యన నిలిచో గుహలో, నిద్రలో ఎవడైనా శాంతంగా ఉండవచ్చు. సుడిగుండంలో కర్మోన్మాదంతో దిగి నీ కేంద్రానికి చేరుకో. కేంద్రానికి చేరిన తరువాత నిన్ను చలింప చేయగలవాడు లేడు.

ప్రవహించే నది పునీతం ముందుకు సాగే సన్యాసి పునీతుడు. సన్యాసి కాంచనాన్ని కోరడం ఆత్మ హత్య చేసుకోడమే.

కాషాయాన్ని ధరించడం భోగాలకు కాదు. వీరకార్య పతాకమది. నీ శరీరాన్ని, బుద్ధిని, వాక్కును విశ్వ శ్రేయానికి అర్పించాలి. "మాతృదేవో

భవ, పితృదేవో భవ" అని చదివి ఉంటావు. కాని "దరిద్ర దేవో భవ, మూర్ఖదేవో భవ" అని నా ఉద్బోధ. పేదలు, విద్యాహీనులు, మూఢులు, వ్యాధిగ్రస్థులు, - వీళ్ళే నీకు దైవస్వరూపులు. వీరిని సేవించడమే అత్యుత్తమ ధర్మమని గ్రహించు.

## సహాయ, సేవా సిద్ధాంతం:

నేనూ దేశ భక్తిని విశ్వసిస్తాను. కాని నాదైన దేశ భక్తి సిద్ధాంతం నాకు ఉన్నది. మహత్కార్య సాధనాలకు మూడు విషయాలు అవసరం. మొదటిది హృదయపూర్వకమైన సానుభూతి. తెలివిలో తర్కంలో ఏము న్నది. అవి కొన్ని అడుగులు సాగిపోతాయి. కాని దివ్యస్ఫూర్తి గుండెలోంచి పొటమరిస్తుంది. ప్రేమ దుర్భేద్యమైన కవాటాలను తెరిపిస్తుంది. విశ్వ రహస్యాలన్నిటికి ప్రేమయే రహదారి. నాభవిష్య సంస్కర్తలారా! నా భవిష్య దేశసేవకులారా! ఆ సానుభూతిని సాధించండి. ఆ సానుభూతి మీకున్నదా? దేవతల, ఋషుల వారసులైన లక్షలాది జనం, పశుతుల్యులుగా ఉన్నారని మీకు ఆవేదన కలుగుతున్నదా? నేటికీ లక్షలుగా ఆకటితో అలమటిస్తున్న వారిని చూచి, అలాగే అనేక యుగాలుగా లక్షలు ఆకలికి, అలమటించి మరణిస్తున్నందుకు దుఃఖపడుతున్నారా? అజ్ఞానం నల్లని మేఘంలా దేశాకాశాన్ని ఆవరించి ఉన్నదని తల్లడిల్లుతున్నారా? అది మీ నిద్రను హరిస్తున్నదా? అది మీ రక్తంలో ప్రవేశించి నరాలలో ప్రవహించి, నీ గుండె చప్పుళ్ళతో కలిసి వినదిస్తున్నదా? ఆ దిగులుతో మీకు పిచ్చి ఎత్తుతున్నదా? అయ్యో అంతా నాశనమై పోయినదే అని మీరు తపిస్తున్నారా? మీ పేరు, ప్రతిష్ఠ, భార్యాపిల్లలు, సంపద, తుదకు మీ శరీరాలను కూడా విస్మరించ గలిగారా? అలా చేయగలిగారా? అదే దేశ సేవకులవడానికి తొలిమెట్టు - అదే తొలిమెట్టు.

అలా స్పందించవచ్చు సరే. తరువాతనో! వ్యర్థ ప్రసంగాలతో శక్తిని వ్యయం చేసే బదులు, ఏదైనా ఆచరణ యోగ్యమైన ఉపాయమాలో చించారా? ఏదైనా మార్గాన్ని అన్వేషించారా? విమర్శించేబదులు ఏదో వ్యావహారికమైన పరిష్కారాన్ని ఏదో సహకరించే పద్ధతిని కనుగొన్నారా? వారి కష్టాలను తీర్చే తీయని సేద తీర్పు మాటలను, జీవచ్ఛవాలుగా ఉన్న

ఆ దీనులను ఉద్ధరించే వ్యవస్థను ఆలోచించారా?

అయినా అంతటితో సరిపోదు. మహాశైలముల వంటి అడ్డంకులను త్రోసిపుచ్చి పురోగమించగల నిశ్చయం మీకున్నదా? సమస్త ప్రపంచం చేత కత్తిపూని, ఎదిరించినా మీరు నిజమని నమ్మినదాన్ని ఆచరించ సాహసించ గలరా? భార్యాపిల్లలు వ్యతిరేకించినా, ధనం నశించినా, కీర్తి లోపించినా, సంపదలు మాయమైనా మీ మార్గాన్ని మీరు అంటిపెట్టుకొని నిలవగ లరా? అలా ఆదర్శాన్ని అనుసరించి, మీ లక్ష్యాన్ని చేరడానికి స్థిరచిత్తంతో పురోగమించగలరా? "భర్తృహరి చెప్పినట్లు" ఋషులు దూషించినా - కీర్తించినా, సంపదలు వచ్చినా - పోయినా, మరణం ఇప్పుడే కలిగినా - నూరేండ్ల తరువాత వచ్చినా, ధీరులు న్యాయమార్గంనుండి ఒక అడుగు మేరయైనా దాటరు.

అంతటి స్థిరత్వం మీలో ఉన్నదా? ఈ మూడు మీలో ఉంటే, మీలో ప్రతి ఒక్కరూ అద్భుతాలను సాధించగలరు. మీరు పత్రికలలో వ్రాయనక్కరలేదు. ఉపన్యాసాల నివ్వక్కరలేదు. మీ ముఖమండలం వెలుగులు కుమ్మరిస్తుంది. మీరు గుహలలో ఉన్నా, ఆరాతి గోడలు దాటి మీ భావాలు నిఖిల ప్రపంచంలో వ్యాపిస్తాయి. వందసంవత్సరాల వరకు ప్రతిధ్వ నిస్తూ, మెదడులనిండి, విజయంసాధించే వరకూ ప్రపంచాన్ని ఆవరిస్తాయి. సంకల్పశక్తి అలాంటిది. అదీ విశ్వాసశక్తి. అదీ లక్ష్యశుద్ధికి గల శక్తి.

## ధర్మానిది తప్పుకాదు:

పేదలను గురించి మన దేశంలో మనం ఆలోచించే పద్ధతికి నా గుండె అమితముగా బాధపడుతుంది. వారికి పైకి ఎదగడానికి అవకాశము లేదు. మరి వారికి మార్గమే లేదు. తప్పుకుందామనుకున్నా దారిలేదు. ఈ దేశంలో పేదలను, నిమ్నులను, పాపులను ఆదరించే స్నేహితులు కరువైనారు. సహకారం లేదు. వారెంత శ్రమించినా పైకి రాలేరు. అలా నానాటికి మరీ మరీ దిగజారుతున్నారు. క్రూరమైన సమాజపు ప్రహారాలను సహిస్తున్నారు. ఆ ప్రహారాలు ఎక్కడ్నుంచి వస్తున్నవో వారికి తెలియదు. చేస్తున్నదెవరో కూడా వారికి తెలియదు. తాము మనుషులమే నన్నమాట కూడా వాళ్ళు విస్మరించారు. దానివల్ల బానిసత్వం వచ్చింది. కొద్ది కాలంగా మేధావులు

తాపులు అనుభవిస్తున్నారు. భారత పునర్నిర్మాణం చేయదలచుకుంటే, వారికొరకు మనం తప్పక శ్రమించాలి.

పేదరికంతో, పురోహితులతో, అణచివేతతో లక్షలాదిగా కాలరాయబడుతున్న లక్షలాది సామాన్య ప్రజకొరకు అహర్నిశలు ప్రార్థించాలి. ఉన్నత స్థితి మంతులకంటే భాగ్యవంతులకంటే ధర్మ ప్రబోధం ఈ పేదలకవసరం. నేను వేదాంతిని కాదు. శాస్త్రజ్ఞణ్ణి కాదు. కనీసం సాధువును కూడా కాను. కాని నేను పేదవాణ్ణి. పేదలను ప్రేమించేవాణ్ణి. ఈ దేశంలో పేదలనబడే వారిని నేను గుర్తించాను. కాని వారికై తపించే వాళ్ళు ఎందరున్నారు? భారతదేశంలో ఎంత విభేదం. ఇరవై కోట్ల స్త్రీ పురుషులను గురించి ఈ సామాన్య జనాన్ని గురించి పేదరికంతో అజ్ఞానంతో పీడింపబడుతున్న ఆ దీనులను గురించి తపించేవాళ్ళు భారతదేశంలో ఎక్కడున్నారు? మరి ఏది మార్గం? వారికి వెలుగు కానరాదు. చదువు లేదు. ఎవరు వారి జీవితాలకు వెలిగిస్తారు? ప్రతి గడపను దర్శించి ఎవరు వారికి విద్య నేర్పుతారు? వీళ్ళే మీకు దేవుళ్ళని భావించండి. వారిని గురించి ఆలోచిస్తుండండి. వాకికై శ్రమించండి. నిరంతరం వారికై ప్రార్థించండి. పరమేశ్వరుడు, మీకు పథ ప్రదర్శనం చేస్తాడు. పేదలకై ద్రవించే వాడు మహాత్ముడు. అలా ద్రవించని వాడే దురాత్ముడు. వారికై నిరంతరం ప్రార్థించడానికి మన సంకల్పాలను ఏకం చేద్దాం. అజ్ఞాతంగా జాలిచూపే వాళ్ళు, మనను చూచి అయ్యో అనే వాళ్ళు కూడా లేకుండా, ఏమి సాధించకుండా మనం మరణింపవచ్చు. కాని మన భావాలలో ఏ ఒక్కటీ నశించదు, త్వరలోనో, కొద్దిగా ఆలస్యంగానో అవి కార్యాన్వితం అవుతాయి. నా భావాలను నేను పూర్తిగా ప్రకటించలేకపోతున్నాను. అది మీకు తెలుసు. మీరూహించుకోవచ్చు. ఆ లక్షలకొలది సామాన్యులు ఆకలితో, అజ్ఞానంతో అల్లాడుతూన్నంతవరకు, వారి ధనంతో చదువుకొని, వారిని కనీసమైన పట్టించుకోని ప్రతి మనిషిని దేశద్రోహిగా భావిస్తాను. లక్షలాది సామాన్య ప్రజలు - నేటికీ సాక్షాత్తూ ఆకలితో ఆటవికులుగా జీవిస్తున్న వారికి - సేవ చేయునంత కాలం, వారిని పీల్చి, చదువుకొని ఆడంబరంగా జీవించే వాళ్ళందరినీ పరమ దుర్మార్గులని నేను భావిస్తాను. సోదరులారా! మనమందరం పేదలం. అకించనులం. కాని అలాంటి వాళ్ళే

తాపులు అనుభవిస్తున్నారు. భారత పునర్నిర్మాణం చేయదలచుకుంటే, వారికొరకు మనం తప్పక శ్రమించాలి.

పేదరికంతో, పురోహితులతో, అణచివేతతో లక్షలాదిగా కాలరాయబడుతూన్న లక్షలాది సామాన్య ప్రజకొరకు అహర్నిశలు ప్రార్థించాలి. ఉన్నత స్థితి మంతులకంటే భాగ్యవంతులకంటే ధర్మ ప్రబోధం ఈ పేదలకవసరం. నేను వేదాంతిని కాదు. శాస్త్రజ్ఞుణ్ణి కాదు. కనీసం సాధువును కూడా కాను. కాని నేను పేదవాణ్ణి. పేదలను ప్రేమించేవాణ్ణి. ఈ దేశంలో పేదలనబడే వారిని నేను గుర్తించాను. కాని వారికై తపించే వాళ్ళు ఎందరున్నారు? భారతదేశంలో ఎంత విభేదం. ఇరవై కోట్ల స్త్రీ పురుషులను గురించి ఆ సామాన్య జనాన్ని గురించి పేదరికంతో అజ్ఞానంతో పీడింపబడుతూన్న ఆ దీనులను గురించి తపించేవాళ్ళు భారతదేశంలో ఎక్కడున్నారు? మరి ఏది మార్గం? వారికి వెలుగు కానరాదు. చదువు లేదు. ఎవరు వారి జీవితాలకు వెలిగిస్తారు? ప్రతి గడపను దర్శించి ఎవరు వారికి విద్య నేర్పుతారు? వీళ్ళే మీకు దేవుళ్ళని భావించండి. వారిని గురించి ఆలోచిస్తుండండి. వారికై శ్రమించండి. నిరంతరం వారికై ప్రార్థించండి. పరమేశ్వరుడు, మీకు పథ ప్రదర్శనం చేస్తాడు. పేదలకై ద్రవించే వాడు మహాత్ముడు. అలా ద్రవించని వాడే దురాత్ముడు. వారికై నిరంతరం ప్రార్థించడానికి మన సంకల్పాలను ఏకం చేద్దాం. అజ్ఞాతంగా జాలిచూపే వాళ్ళు, మనను చూచి అయ్యో అనే వాళ్ళు కూడా లేకుండా, ఏమి సాధించకుండా మనం మరణింపవచ్చు. కాని మన భావాలలో ఏ ఒక్కటీ నశించదు, త్వరలోనో, కొద్దిగా ఆలస్యంగానో అవి కార్యాన్వితం అవుతాయి. నా భావాలను నేను పూర్తిగా ప్రకటించలేకపోతున్నాను. అది మీకు తెలుసు. మీరూహించుకోవచ్చు. ఆ లక్షలకొలది సామాన్యులు ఆకలితో, అజ్ఞానంతో అల్లాడుతూన్నంతవరకు, వారి ధనంతో చదువుకొని, వారిని కనీసమైన పట్టించుకోని ప్రతి మనిషిని దేశద్రోహిగా భావిస్తాను. లక్షలాది సామాన్య ప్రజలు - నేటికీ సాక్షాత్తూ ఆకలితో ఆటవికులుగా జీవిస్తున్న వారికి - సేవ చేయునంత కాలం, వారిని పీల్చి, చదువుకొని ఆడంబరంగా జీవించే వాళ్ళందరినీ పరమ దుర్మార్గులని నేను భావిస్తాను. సోదరులారా! మనమందరం పేదలం. అకించనులం. కాని అలాంటి వాళ్ళే

పరమేశ్వరుని చేత పనిముట్లు.

## "పెనుగులాడండి - పెనుగులాడండి" ఇదే నేటి నినాదం:

సంఘటనతో ముందుకు త్రోసుకు వెళ్ళండి. స్నేహం, నిజాయితీ, ఓర్మి తప్ప ఇంకేమీ అవసరం లేదు. వికసించనిదే విస్తరించనిదే, ప్రేమించనిదే జీవితం ఏమిటి? స్నేహమే జీవితం, అదొక్కటే జీవనధర్మం. స్వార్థం మృత్యువు. నేటికీ - ఎప్పటికీ ముమ్మాటికీ ఇది సత్యం. మేలు చేయడం జీవనం. ఇతరులకు మేలు చేయకపోవడం మరణం. నూటికి తొంబది మంది ఈ మనుష్య జంతువులు మరణించిన వారి క్రింద లెక్కే. వాళ్ళు భూతాలు - ప్రేమలేని వాడు బ్రతికిన వాడి క్రింద లెక్కకాదు. నా వత్సలారా! స్పందించండి. పేదలకై, పతితులకై అజ్ఞానులకై స్పందించండి గుండె ఆగే వరకు, మెదడు స్తబ్ధమయ్యేంతవరకు, ఉన్మాదుల మవుతామా అన్నంతవరకు స్పందించండి. అప్పుడు మీ ఆత్మను పరమేశ్వరుని పాదాలపై క్రుమ్మరించండి. అప్పుడు మీకు శక్తి, సహాయము, అజేయ సామర్థ్యం లభిస్తాయి. పెనుగులాడండి - పెనుగులాడండి - ఇదే పదేండ్లుగా నా లక్ష్యం. పెనగులాడండని నేటికీ చెప్పుతున్నాను. చుట్టూ చీకటి ఉన్నప్పుడు, పెనుగు లాడండని ఉద్బోధించాను. వెలుగు పారిస్తున్నాట. నేటికీ పెనుగులాడండనే అంటున్నాను. వత్సలారా! భయపడకండి. ఆపై అసంఖ్యాక నక్షత్ర మండలాన్ని - అవిదిగ మిమ్మల్ని అణచి వేస్తాయేమోననే భయంతో చూడకండి. నిదానించండి. కొన్ని గంటలలో సర్వస్వమూ నీ పాదల క్రిందికి వచ్చేస్తుంది. డబ్బుకు ఇచ్చే శక్తి లేదు. పేరు ప్రఖ్యాతులు ఏమీ యివ్వలేదు. విద్యవల్ల కూడా ఏమీ లభించదు. ప్రేమ ఇస్తుంది. శీలమే కష్టాల దుర్గమమైన అడ్డంకులను చీల్చుకొని ముందుకు వెళ్తుంది.

నా విశ్వాసం అంతా యువతరం మీదనే, నవీన తరం మీదనే. వారి లోనుంచే నా కార్యకర్తలు వస్తారు. సింహాలవలే వారు ప్రజల సమస్యలలో దిగి పరిహారం వెదుకుతారు. నేను ఒక వ్యూహాన్ని నిర్మించాను. దానికై నా జీవితాన్ని అర్పించాను. నేను విజయాన్ని సాధించలేకపోతే, నా కంటే ఉత్తముడైన మరో వ్యక్తి వచ్చి సాధిస్తాడు. పోరాటంలోనే నాకు తృప్తి. ప్రజల హక్కులను ప్రజలకు ఇవ్వడమే మీ ముందున్న సమస్య.

ప్రపంచం ఎన్నడూ దర్శించిన ఉత్తమోత్తమ ధర్మం మీకున్నది. కానీ మీరు ప్రజలకు చెత్తా చెదారం నేర్పుతున్నారు. అనంత ప్రవాహం మీ అందుబాటులో ఉంది. కాని వారికి మురుగు కాల్వల నీరందిస్తున్నారు.

ఒక లక్షమంది యువకులు - యువతులు - పవిత్ర భావంతో జ్వలించేవారు. పరమేశ్వరుని యందు అచంచల భక్తిగలవాళ్ళు, పేదలకై, పతితులకై, అణగారిన వారికై సానుభూతితో సింహవిక్రమం ప్రదర్శించగలవాళ్ళు ఈ దేశం నాల్గు చెరుగులా వ్యాపిస్తారు. ముక్తి సందేశాన్ని వినిపిస్తారు. సహకార సందేశాన్ని వ్యాపింపచేస్తారు. సాంఘిక చైతన్యాన్ని ప్రభోదిస్తారు. సమానత్వ సిద్ధాంతాన్ని ఉద్ఘోషిస్తారు.

# వివేక సత్సంగం

## బహుజన సుఖాయ - బహుజన సుఖాయ

స్వామి:- శక్తి మొదలైనవి స్వయంగా లభిస్తాయి. పని ప్రారంభించండి. ఎదురులేని శక్తి లభిస్తుంది. చివరికి ఆ శక్తిని భరించడం కూడా కష్టమేనని పిస్తుంది. పరులకోసం ఏ మేలు చేసినా, దాని వలన మనలోని శక్తి మేలు కుంటుంది. ఇతరులను గురించి మేలు తలంచినా, అది క్రమంగా మనలో సింహశక్తిని నింపుతుంది. మీరందరిపైనా నాకు ప్రేమ ఉన్నది. కాని మీరు యితరులకై కష్టిస్తూ, కష్టిస్తూ మరణించాలని నా కోరిక. దాని వల్లనే నాకు ఆనందం లభిస్తుంది.

శిష్యుడు:- అప్పుడు మమ్మల్ని నమ్ముకున్న వాళ్ళగతి ఏమికావాలి?

స్వామి:- నీవు ఇతరులకు సహాయం చేయడానికి, సిద్ధమవుతే, పరమేశ్వరుడే నీ వాళ్ళకు ఏదో దారి చూపుతాడు. గీతలో కృష్ణుడు "నహి కళ్యాణ కృత్ కశ్చిత్, దుర్గతిం తాతగచ్ఛతి" మేలు చేసే వాడెప్పుడూ దుర్గతిపాలు కాడు అని చెప్పలేదా!

శిష్యుడు:- నిజమే.

స్వామి:- త్యాగం ముఖ్యం. త్యాగం చేయకుండా ఇతరుల కోసం

పనిచేసేటప్పుడు హృదయాన్ని పూర్తిగా అర్పించలేరు. త్యాగి అందరినీ సమదృష్టితో చూస్తాడు. అందరి సేవకు తన నర్పించుకుంటాడు. సమ దృష్టి తో చూడమని మన వేదాంతం కూడా చెప్పుతున్నది గదా! మరి అలాంటప్పుడు, నీ భార్య, నీ పిల్లలు ముఖ్యులని ఎందుకు భావిస్తావు. ఆకలితో అల్లాడుతూ నిరుపేదగా, భిక్షుకునిగా నీ వాకిట ఆ నారాయణుడు స్వయంగా పడి ఉన్నాడు. అతనికి పెట్టకుండా, పంచభక్ష్య పరమాన్నాలను నీ భార్య పిల్లలకు మాత్రమే పెట్టి అందరి ఆకలి తీర్చగలవా? అది పాపాన్నం కాదా?

శిష్యుడు:- ఇతరుల కొరకు పని చెయ్యాలంటే చాలా ధనం కావాలి. అదెలా నాకు లభిస్తుంది.

స్వామి:- నీకు చేతనైనంత ఎందుకు చేయకూడదు. ధనం లేమి వల్ల నీవు యితరులకు ఏమీ యివ్వలేక పోవచ్చు. కాని కొన్ని మంచి మాటలు, కొన్ని హితోక్తులు వారి చెవుల కందీయవచ్చుగదా! అలా ఎందుకు చెయ్యవు? దానికైనా ధనమవసరమా?

శిష్యుడు:- అవునండీ! ఆ పని నేను చేయగలను.

స్వామి:- "చేయగల" నన్నంత మాత్రాన చాలదు. ఆచరణలో చేసి చూపించు. అప్పుడు నీకు కొంత మేలు కలిగిందని గ్రహిస్తావు. లేచి కార్యానికి పూనుకో! ఈ జీవితం ఎన్నాళ్ళుంటుంది. ఈ లోకంలోకి వచ్చినందుకు, ఏదో కొంత మంచి చేసి వెళ్ళు. లేకపోతే నీకూ ఈ చెట్టు పుట్టలకు, రాయి రప్పలకు భేదమేమున్నది. అవీ పుడుతున్నాయి. గిట్టుతున్నాయి. వాటిలా పుట్టి గిట్టాలని నీకుంటే, నిరభ్యంతరంగా అలాగే చేయి. లేదా, నీ వేదాంతపు చదువు, పరమోత్తమమైన మేలును చేకూర్చిందని, ఆచరణలో చూపు, పోయి నీ ప్రతి ఒక్కరిలోనూ అనంతశక్తి ఉన్నదని చెప్పి జాగృతం చేయి. వ్యక్తిగతంగా ముక్తి పొంది సాధించేదేమిటి? అది కేవలం స్వార్థం, నీ ధ్యానాన్ని, ముక్తిని, గిక్తినీ ప్రక్కకు నెట్టు. నేను ఆత్మార్పణం చేసి, నిష్ఠతో ప్రారంభించిన ఈ మహత్కార్యంలో చేరి నీ సంపూర్ణ హృదయాన్ని, ఆత్మను సమర్పించుకో.

స్ఫూర్తిదాయకములైన ఆ వాక్కులను శిష్యుడు నోరు మెదల్పకుండా వింటున్నాడు. స్వామి కూడా తన సహజమైన అగ్ని పూరితమైన వాగ్ధోరిణితో చెప్పుకుపోతున్నారు.

"మొదట తగిన వాతావరణాన్ని నిర్మించండి. తరువాత కాలక్రమంగా మతాన్ని గురించి ఉపన్యసించడానికి వేలకొలది వివేకానందులుద్భవిస్తారు. అనాథ శరణాలయాలను, కరువు నివారణ కార్యక్రమాలను వేను ప్రారంభించడానికి కారణం తెలుసా? ఆంగ్ల వనిత నివేదిత భారతీయులను సేవించడానికి చివరకు పాకీ పని కూడా చేస్తున్నది, కనబడడం లేదా? మీరు భారతీయులు - మీ సోదరులకు ఆ విధంగా సేవ చేయలేరా? ఎక్కడెక్కడ మహామారి విజృంభిస్తుందో, కరువు తాండవిస్తుందో అక్కడక్కడికి మీరు వెళ్ళండి. ప్రజల బాధలను ఉపశమింపచేయండి. అలా శ్రమిస్తూ మీరు మరణించవచ్చు. నష్టంలేదు. మన లాంటి క్షుద్రకీటకాలు ప్రతిరోజు ఎన్ని పుట్టడంలేదు, ఎన్ని గిట్టడంలేదు. దాంతో ఈ విశాల జగత్తులో ఏమైనా లోపం ఏర్పడుతుందా? చావు తప్పదు. కాని చావడానికి కూడా ఒక ఉత్తమ ఆదర్శాన్ని వరించండి. జీవితంలో ఉన్నతమైన ఆశయంతో మరణించడం మేలు. ఈ ఆశయాన్ని ప్రతియింటా ప్రతి వాడలో బోధించండి. దానివల్ల మీకు క్షేమం చేకూరుతుంది. అంతేకాదు. దేశానికి మేలు చేసిన వారు అవుతారు. మనదేశం మీ మీదే తన ఆశలన్నిటిని పెట్టుకొని కూర్చున్నది. మీరు సోమరులై కాలక్షేపం చేయడం నాకు మహాబాధగా ఉన్నది. పని మొదలు పెట్టండి. కార్య దీక్ష తీసుకోండి. అలస్యం ఇక వద్దు. రోజు రోజుకు మృత్యువు సమీపిస్తున్నది. ఎపుడో, భవిష్యత్తుల్లో ఆ పని జరుగుతుందని సోమరులై కూర్చోవద్దు. అలా కూర్చుంటే ఏ పనీ నెరవేరదని గుర్తించుకోండి."

వివేకసేవ:

మనం ఎంతైనా మాట్లాడవచ్చు. కాని చెడునెదిరించే పని వాస్తవ జ్ఞానం కంటే మించిన విజ్ఞానాన్ని ఇస్తుంది. చెడునెదిరించాలనే భావం మొదట కలగాలి. అది మనలో జిజ్ఞాస రేపాలి. మన రక్తంలోంచి ఉద్రేకాన్ని తొలగించాలి. ప్రపంచ చరిత్రలో ఉద్రేకంతో సంస్కరణలు

ప్రారంభమైన ప్రతిచోటా, చివరికి లక్ష్యాలనే విఫలమొనర్చాయి.

అందరినీ సేవించి హిందువు తననుద్ధరించుకో చూస్తాడు. అలాగే హిందూ జనాన్ని పైకి లేపాలి కాని ఏదో విదేశీ ప్రభావానికై ఎదురు చూడడం కూడదు.

స్వర్గంలో దుఃఖ ముండదంటారు. కన్నీరు కార్చని మనిషిని నేను నమ్మను. గుండె వుండవలసిన చోట అట్టి వానికి నల్లబండరాయి ఉంటుంది. స్వర్గవాసులకు సానుభూతి ఉండదనేది స్పష్టమే. అక్కడ చాలామంది ఉన్నారు. కాని ఈ లోకంలో బాధపడే దయనీయ ప్రాణులంగా మనము ఉన్నాము. ఈ స్వర్గవాసులు మనను ఉద్ధరించవచ్చు. కానీ వారు కదలరు. వారు ఏడ్వరు. అక్కడ దుఃఖదైన్యాలు లేవు. కనుక మరొకరి దైన్యాన్ని వాళ్ళు పట్టించుకోరు. వాళ్ళు అమృతాన్ని సేవిస్తుంటారు. వాట్యం కొనసాగుతుంటుంది. అందాల భార్యలు వగైరాలు వాళ్ళకు ఉంటారు.

తోటివారి పట్ల మంచిగా వ్యవహరించమనే ప్రతి మతమూ చెపుతుంది. మంచి చేయడం ఏదో అసాధారణం కాదు. బ్రతకడానికి అదొకటే దారి. ప్రకృతిలో ప్రతీదీ జీవించడానికి విస్తరించుకుంటుంది. మరణించడానికి ముడుచుకుంటుంది. ధర్మ విషయంలోనూ అంతే. నిమిత్తమంటూ ఏదీ లేకుండా, పరులకు సహాయపడుతూ మేలు చేయి. అలా చేయడం మానిన క్షణం సంకోచం పొందుతావు. మరణమాసన్నమవుతుంది.

మనం మంచి చేయాలి. ఇతరులకు సేవచేయగలగడం ఒక మహద వకాశమని, మనకు స్పృహ ఉన్నంతవరకు అలా సేవచేయాలనే కోరికే మనకు ప్రేరకశక్తి అవుతుంది. పెద్ద అరుగుమీద నిల్చుని, నాల్గు దమ్మిడీలు పట్టుకొని "ఓ పేదవాడా ఇదిగో! తీసుకో!" అని అనకు. ఆ పేదవాడు నీ వాకిట నిల్చున్నందుకు నీకు దానం చేసే అవకాశం లభించింది. దాంతో నీకు నువ్వే సహాయం చేసుకుంటున్నావు. దానం స్వీకరించిన వాడు కాదు. దాతే ఎప్పుడూ ధన్యుడవుతాడు. దానం చేయగల అవకాశం లభించి పవిత్రుడవై సంపూర్ణ మానవుడవువడానికి నీకవకాశం లభించినందుకు సంతోషించు. మంచి పని ఏదైనా పవిత్రతనూ,

సంపూర్ణత్వాన్ని ప్రసాదిస్తుంది.

గృహస్థు తన సంపాదనలో ఒక నాల్గవవంతు కుటుంబానికి, ఒక నాల్గవవంతు దానానికి, ఒక నాల్గవవంతు మిగుల్చుకోడానికి, ఒక నాల్గవవంతు తనకై వ్యయం చేసుకోడానికి ఉపయోగించాలి. ఇదీ మన నియమం.

***

**

*

విశ్వఖ్యాతం కృతం యేన
భారత స్యోజ్వలం యశః
వందే వివేకానందం తం
సద్ధర్మ పథ దర్శకమ్-

భారత దేశపు ఉజ్వల యశానికి ప్రపంచంలో కీర్తి వెలయించిన, సద్ధర్మ ప్రదర్శకుడు - ఆ వివేకానందునికి నమస్సులు-

## తీర్థరాజం

నేను తిరిగివస్తున్నప్పుడు, ఒక ఆంగ్ల మిత్రుడు, 'స్వామీ! విలాస, వైభవ, సామర్థ్యాలతో తులతూగుతున్న ఈ పాశ్చాత్య దేశాలలో నాలుగేండ్లు గడిపారు కదా! మరిప్పుడు మీ మాతృభూమిని గురించి మీరేమనుకుంటున్నారు' అని అడిగాడు. దానికి "ఇక్కడికి రాకముందు నేను భారతదేశాన్ని అభిమానించే వాణ్ణి. కాని ఇప్పుడు భారతదేశపు ప్రతి ధూళి కణమూ నాకు పునీతముగా కన్పిస్తున్నది. అక్కడి గాలి నాకు పవిత్రమైనది. ఇప్పుడది నా పుణ్యభూమి నా యాత్రాస్థలము, నా తీర్థరాజము" అని మాత్రమే అనగలిగాను.

ప్రపంచంలో కల్లా పుణ్యభూమిగా ఆదరించబడిన భూమి, జీవులు తాము చేసిన కర్మలకు పంజాయిషీ చెప్పుకునేందుకు తప్పక జన్మించవలసిన భూమి, పరమేశ్వరుని చేరుకోడానికి పురోగమిస్తున్న ప్రాణులు తుది మజిలీగా జన్మించవలసిన భూమి, మృదుత్వాన్ని, దాతృత్వాన్ని, పునీతత్వాన్ని, సాధించి శాంతికీ, అన్నిటికీ మించి, ఆత్మ విమర్శకూ, ఆధ్యాత్మికతకూ ఆధారంగా నిలచిన భూమి ఏదైనా ఉన్నదంటే అది ఈ భారత భూమి మాత్రమే. అనాదిగా ఇక్కడి నుండే ధర్మ ప్రవర్తకులు బయలుదేరి, పునీతమైన, అనంతమైన, ఆధ్యాత్మిక సత్యాలతో ప్రపంచాన్ని ముంచెత్తారు. ఇక్కడినుండే ఉప్పెనలా వేదాంత తరంగాలు ఉప్పొంగి సమస్త పృథ్విలో తూర్పు పడమరలను, ఉత్తర దక్షిణాలను ఆక్రమించాయి. తిరిగి ఇక్కడినుండే ఆ తరంగాలు బయలుదేరి ప్రపంచంలోని భౌతిక నాగరికత ఆధ్యాత్మమయం చేస్తాయి. మిగతా దేశాల లక్షలాది ప్రజల హృదయ, శరీరాల నాక్రమించి మండుతున్న భౌతిక నాగరకతా జ్వాలలను

ఉపశమింపచేసేందుకు ప్రాణం పోయగల జీవన స్రోతస్సు ఈదేశంలోనే ఉన్నది. సోదరులారా! నన్ను విశ్వసించండి. ఇది సార్థకం కామన్నది.

## వేదాంతానికి పునీతభూమి

ధర్మానికీ, వేదాంతానికీ నెలవైనదీ మన పవిత్ర మాతృభూమి. ఆధ్యాత్మిక దివ్య మూర్తులను ప్రసవించిన భూమి. త్యాగభూమి ఇది. అతి ప్రాచీన కాలంనుండి ఈ అధునాతన కాలం వరకు మానవ జీవనానికి పరమ లక్ష్యమైన ఆదర్శాన్ని చేరుకోడానికి అవకాశం కల్పించిన భూమి.

ఈ తల్లి ప్రభావం - విన్పించకుండా, కన్పించకుండా ప్రపంచంమీద మెత్తని మంచులా కురిసి, పరమ సుందరమైన సుమనాలను వికసింపచేసింది. ఆ ప్రభావం సహజంగా మృదులమైనది. అందుకే మన దేశాన్ని దాటి ఆ ప్రభావం మిగతా స్థలాలకు పయనించడానికి కాలమాన పరిస్థితులు తోడయ్యే వరకు వేచి వుండాల్సి వచ్చినా, తన ఎల్లలలో తన పని తాను చేసుకుంటూనే ఉన్నది.

ఓహో! ఏమి దేశమిది? దీని మీద నిల్చున్నవాడు పరాయి వాడైనా, ఈ నేలను పుట్టినా - వాని ఆత్మ అధమ పశుస్థాయికి దిగజారకపోతే - చరిత్రకు అందని ప్రాచీన కాలంనుండి ఈ నేలలో పశుత్వాన్ని దైవత్వ దిశగా పయనింప చేయడానికి శ్రమిస్తున్న అత్యున్నత పవిత్ర మూర్తుల సజీవభావాలు తన నావేసించినట్లు భావిస్తాడు. ఇక్కడి గాలిలో, ఆధ్యాత్మిక తరంగాలు ప్రవహిస్తాయి. వేదాంతానికి, నీతికి, పరమార్థానికి పునీతమైనదీ భూమి. పశుత్వాన్ని జయించడానికి సాగిన నిరంతర పోరాటంలో ఒక క్షణం విశ్రాంతి నిచ్చేస్థలం ఇది. పశుత్వపు ఆవరణాలు విసర్జించి, జనన, మరణాలు లేని, ధన్యమైన అమృతమూర్తిగా వెలుగొందుతూ నిల్చోగల శిక్షణ నిచ్చే దివ్యస్థలమిది. ఈ భూమిలో జీవనంలో భోగభాగ్యాలు పూర్తిగా అనుభవించి, దైన్యత్వపు నీలి నీడలను చూచి ఇదంతా అహంకారమని, గ్రహించేంతవరకు కొనసాగి, నిండు యవ్వనంలో, భోగ విలాసాల పొత్తిళ్ళలో, వైభవ పరాకాష్ఠలో, అంతులేని అధికారంలో దర్శిస్తూన్న తరుణంలో ఆ మాయా మమకారాలనన్నిటిని ఆ బంధనాలను త్రెంచుకొని మానవుడు మొట్టమొదటిసారి బయట పడ్డ భూమి ఇదే.

ఇక్కడే మానవ మహాసముద్రం నట్టనడుమ ఆనంద బాధల, శక్తి బల హీనతల, వైభవ దారిద్ర్యాల, దైన్యాల, సుఖ దుఃఖాల, హాస్యాశ్రువుల, జీవన మరణాల, శాశ్వత శాంతి, మౌనాల ద్వంద్వాలను కరగపోసిన జీవన లయలోంచి త్యాగ సింహాసనం ఆవిర్భవించింది.

మహత్తరమైన జీవన్మరణ సమస్యల మధ్య జీవించాలనే దాహాగ్నితో, దాన్ని కాపాడుకుందామని నెత్తికి చుట్టుకున్న బాధలతో మొట్టమొదటిసారిగా తలపడి పరిష్కారాన్ని కనుగొన్నది ఈ భూమిలోనే. ఇలా పరిష్కరించగల భూమి న భూతో న భవిష్యతి. జీవితమే ఒక భ్రమ అనీ, ఒక సద్వస్తువుకిది కేవలం ప్రతిబింబమని మొదట కనుగొన్న దిక్కడే. ధర్మం ఆచరణ యోగ్యమై, వాస్తవమైన దిక్కడే. మిగతా చోట్ల తమ సుఖానికి బలహీనుల దోపిడీకి బలవంతులు ఉద్యమిస్తే, తమ లక్ష్యాన్ని సాధించడానికి స్త్రీ పురుషులు సాహసంతో ఉద్యమించిందిక్కడే. కేవలం మనిషినే కాక పశు పక్ష్యాదులను లతా వృక్షాలను గుండె విచ్చి అక్కున చేర్చుకున్నదిక్కడే. ఇక్కడి ప్రజల విస్తృతమైన విశాల హృదయాలలో అత్యుత్తములైన దేవతల నుండి ధూళి కణం వరకు, అధికులకు, అధములకు సమానమైన స్థానం ఉంటుంది. ఇక్కడే విశ్వాన్ని అఖండ వ్యష్టిగా, దాని ప్రతి స్పందనతో తన స్పందన తాదాత్మ్యం పొందినట్లు భావించి అధ్యయనం చేసింది ఇక్కడే.

## అమర భూమి - అమృత సామర్థ్యం:

ఎన్నో ఉప్పొంగి పారలే నదులు, గర్జించే ప్రవాహాలు, ఎన్నో హిమనదాలు, నిరంతరం పారే నిర్ఝరాలు, హిమాచ్ఛాదిత హిమాలయ శిఖరాలలో ఉద్గమించి, ప్రవహించి, ఒక్కటై మహనీయ దివ్యధారగా - గంగగా రూపొంది, రాజసంగా ప్రవహించి సముద్రాన్ని చేరుకుంటాయి! అలాగే ఎన్ని భావాలు, ఎన్ని ఆలోచనలు, ఎన్ని శక్తి తరంగాలు, అసంఖ్యాక సాధుమూర్తుల ఎదల లోంచి వెలువడి, వివిధ దేశాల మేధావుల బుద్ధుల లోంచి వెలువడి భారతాన్ని ఆవరించాయో! ఇది కర్మభూమి, ఉన్నత మానవ బుద్ధి విశ్వాసాలకు రంగస్థలం.

ఇతర దేశాలలో ప్రవేశించే ముందు విజ్ఞానం తన పుట్టినిల్లుగా వరించింది ఈ భూమినే. ఆధ్యాత్మిక భావాలు ఉప్పొంగి, భౌతికంగా, సముద్రాలుగా పొంగి పారలే నదులుగా ఆధ్యాత్మిక :ావ తరంగాలు ఉప్పొంగిన దేశం,

సృష్టి రహస్యాన్ని వెలువరించి గ్రహించడానికి, హిమోత్తుంగ శిఖరాలు ఆకాశ గర్భాన్ని చీల్చుకుని అంచెలంచెలుగా పైపైకి ఎదిగిన దేశం ఇదే. పరమ శ్రేష్ఠులైన మహాత్ములు నడయాడిన భూమి ఇదే. మానవ స్వభావాన్ని గురించి, విశ్వ రహస్యాన్ని గురించి మొట్ట మొదట ఆలోచన సాగినది ఈ భూమిలోనే. ఆత్మ శాశ్వతమనీ, సృష్టినియమనం చేసే ఈశ్వరుడొకడున్నాడని, అంతర్వర్తిగా ప్రకృతిలో మనిషిలో దేవుడున్నాడని తొలుత సిద్ధాంతీకరించింది ఈ భూమిలోనే. ధర్మ వేదాంతాలు అత్యున్నత శిఖరాలను, అంతిమ రేఖలను చేరుకున్న దేశమిదే. ఈ భూమినుండే ఆధ్యాత్మము, వేదాంతాలు ప్రళయ తరంగాలు పొంగి మిగతా ప్రపంచాన్ని ముంచి ఎత్తాయి. తిరిగి ఇక్కడి నుండే అలాంటి తరంగాలు లేచి శిధిల మవుతూన్న మానవ జాతులకు ప్రాణాన్ని శక్తిని సమకూర్చవలసి ఉన్నది. శతాబ్దాల ఆఘాతాలను, వందలాది దురాక్రమణలను, వేలకొలది అలవాట్ల, ఆచారాల ఆటుపోట్లను సహించి భరించి నిలచిందీ భారతదేశమే. అమృత శక్తితో, నాశ రహిత జీవనంతో, ప్రపంచంలోని కఠినాతి కఠిన గండ శిలల కన్నా దృఢంగా నేటికీ ఇతోధిక స్థైర్యంతో నిల్చున్న భూమి ఈ భారతదేశమే. ఆత్మలా భారతదేశం జనన, మరణాలు లేనిది, శాశ్వతమైనది. అలాంటి భూమి సంతానం మనము.

## సహనాన్ని సాధించి జీవించిన దేశం:

ప్రపంచానికి "సహన" మనే ఆదర్శాన్ని మొట్టమొదట నేర్పినదీ దేశమే. మిగతా దేశాలలో సహన, సానుభూతులు కేవలం సిద్ధాంతాలుగా మాత్రమే మిగిలిపోగా, ఈ దేశములోనే అవి ఆచరణ సాధ్యమైనాయి. ఇక్కడే - కేవలం ఈ దేశములోనే హిందువు మహమ్మదీయుని కొరకు మసీదు కట్టిస్తాడు. క్రైస్తవునికై చర్చిని నిర్మించి ఇస్తాడు.

ప్రపంచం మన మాతృభూమికి అమితంగా ఋణపడి ఉన్నది. ఒక్కొక్క దేశాన్ని వెదికి చూస్తే, ప్రపంచంలో సహనశీలి హిందువును, "మెతక హిందువు" ను పోలిన మరొకడు ఏ జాతిలోనూ లేడు. "మెతక హిందువు" అనే మాటను అప్పుడప్పుడు, తృణీకార సూచకంగా వాడుతుంటారు. కాని తృణీకార సూచకంగా ప్రయోగించే ఏదైనా శబ్దం మహత్తరమైన అర్థాన్ని స్ఫురించేదుంటే "మెతక హిందువు" అనేదే ఆ శబ్దం. ప్రపంచంలో ఇతరత్రా

ఎన్నో సభ్యతలు జన్మించాయి. అప్పుడూ, ఇప్పుడూ, బలవంతమైన సమాజాలలో, బలహీన జాతులలో కూడా అపూర్వమైన భావాలు ఎన్నో ఉదయించాయి. అప్పుడూ ఇప్పుడూ అద్భుత మైన, భావాలు ఒక జాతి నుండి మరొకజాతికి సంక్రమిస్తూ వస్తున్నాయి. పురోగమిస్తున్న జాతీయ లహరులు, మహత్తర సత్యాలు, శక్తులు బీజాలకు వివిధ దేశాలకు పంచబడుతున్నాయి. కాని మిత్రులారా! ఒక విషయాన్ని విస్మరించకండి. ఈ జరిగిన దంతా యుద్ధభేరీల నినాదాలతో, యుద్ధ సన్నద్ధులైన సైనికుల వెంట ప్రయాణించినవే, ప్రతి భావమూ రక్త ప్రవాహంలో తడిసి ప్రసరించాల్సి వచ్చింది. ప్రతి భావమూ లక్షలాది తోటి మానవుల రక్తపు మడుగులను దాటి వ్యాపించాల్సి వచ్చింది. ప్రతి భావము లక్షలాది ప్రజల ఆక్రందనలతో, అనాథల ఆర్తనాదాలతో. భర్తల కోల్పోయిన స్త్రీల కన్నీటి ధారలతో తడిసి రావలసి వచ్చింది. మిగతా జాతులు - ముఖ్యంగా ప్రచార మొనరించింది ఈ విధంగానే. కాని వేల సంవత్సరాలుగా భారతదేశం శాంతిగా జీవిస్తున్నది. గ్రీకు అనేది ఏర్పడకముందే రోమును గురించిన మాట వినపడకముందే, నేటి యూరోపీయుల పితరులు అడవుల్లో నివసిస్తూ, శరీరాన్ని రంగులలో పులుముకుంటూండిన రోజుల్లోనే ఈ దేశంలో కర్మమయ జీవనం అంకురించింది. ఇంకా పూర్వమే, చరిత్రకు గుర్తులేని నాట, పరంపర అశహన ప్రాచీన కాలఖండాన్ని చూడసాహసించని నాట, ఆనాటి నుండి నేటి వరకు - ఒక భావన వెంట మరో భావన ఇక్కడినుండి బైటికి నడచాయి. ఇవన్నీ ప్రాచీనుల ఆశీస్సులతో, శాంతిని అవధరించుకొని ఈ భావనలు ముందుకు సాగాయి. ప్రపంచ దేశాలలో దురాక్రమణ అంటూ ఎరుగని దేశమంటే ఇదొక్కటే. పరమేశ్వరుని ఆశీస్సులు మన శిరస్సున నిరంతరం ఉన్నాయి. కనుకనే మనం జీవిస్తాము.

# ప్రాచీన గురువు

## భౌతిక విజ్ఞానం:

భారత దేశపు వాస్తవ చరిత్ర త్రవ్వి తీసిన రోజున ధర్మానికే గాక, లలిత కళలకు కూడా ఈ దేశం ఆదిగురువుగా ఋజువవుతుంది.

భారత దేశపు తరతరాలకు శాస్త్రజ్ఞులైన వైద్యులను ప్రసాదించింది. సర్

విలియం హంటర్ చెప్పినట్లు, వివిధ రసాయనాలను కనిపెట్టి ఆధునిక విజ్ఞాన శాస్త్రానికి అందించింది, వైకల్యం పొందిన చెవులను, ముక్కులను చక్కదిద్ద నేర్పింది. గణితం, బీజగణితం, రేఖాగణితం, జ్యోతిషశాస్త్రం, ఆధునిక విజ్ఞాన శాస్త్రం సాధించిన విజయాలు, మిశ్రమ గణితం - ఇవన్నీ భారత దేశములో ఉద్గమించినవే. ఆధునిక సభ్యతకు కేంద్రమైన "పది సంఖ్యలను కనుగొన్నది భారతదేశమే. వాస్తవంగా అవన్నీ సంస్కృత శబ్దాలే"

న్యూటను జన్మించడానికి వేలయేండ్ల పూర్వమే భారతదేశానికి గురుత్వాకరణ శక్తి తెలుసు.

## వేదాంతం:

వేదాంతంలో నేటికీ మిగితా జాతుల కంటే మనం మిన్నగానే ఉన్నాము. ప్రఖ్యాతుడైన జర్మన్ తత్వవేత్త స్కాపెన్ హవర్ ఈ విషయాన్ని అంగీకరించాడు. సంగీతంలో ఆరోహణ అవరోహణలు, సప్తస్వరాలు, శ్రుతిలయలు క్రీస్తుపూర్వం 350 నాటికే మనకు తెలుసు. భాషా శాస్త్రంలో సంస్కృతాన్ని మిగతా యూరోపీయ భాషలకు తల్లి అని సర్వత్రా అంగీకరిస్తూనే ఉన్నారు. అవన్నీ సంస్కృతం నుంచి ఏర్పడిన అపభ్రంశభాషలే.

ప్రపంచ సాహిత్యంలో మన ఇతి హాస పురాణ నాటకాలు మిగతా భాషా సాహిత్యం కంటే ఉన్నతమైనదే. మన కాళిదాసు శకుంతలను ప్రశంసిస్తూ క్లుప్తంగా జర్మన్ మహాకవి! ఇక్కడ "స్వర్గ - మర్త్యములు" సంగమించాయని కీర్తించాడు. ఈసోపు కథలు పురాతన సంస్కృత గ్రంథంలోంచి సంచయించి భారతదేశమే ప్రపంచానికి అందించింది. అరేబియన్ రాత్రుల కథలను, మరి సిండ్రిల్లా కథను, బీన్ స్టాక్స్ గాథను ఈ దేశమే ప్రపంచానికిచ్చింది. పరిశ్రమలలో ప్రత్తినీ, రంగులను కనుగొన్నదీ దేశమే. వివిధాభరణాల నిర్మాణంలో ఈ దేశం దక్షురాలు. శర్కర, అనే పదానికి, శర్కరకూ ఉత్పత్తి స్థానం భారతమే. చివరకు చదరంగం, పేకాటల్ల పేక, జూదం కనుగొన్న దేశం ఇదే. భారత వైభవోన్నతికి ఆకర్షితులైన యూరోపీయ క్షుదార్తులకు, అమెరికాను కనుగొనే పరోక్షమైన అవకాశం కల్పించింది కూడా ఈ దేశమే.

ఇంత చేసిన భారతానికి ఈ ప్రపంచం తిరిగి ఇచ్చిన దేమిటి? కువిమర్శ

- శాపం - ద్వేషం. ప్రపంచమామె సంతాన రక్తంలో విషాన్ని రంగరించింది. దీనిని దరిద్ర దేశంగా చేసింది. అది చాలక, మిగతా మతాల శిధిలాలపై మాత్రమే వ్యాపించగల మతాన్ని బోధిస్తూ, మండుతూన్న గాయం మీద కారం జల్లుతున్నది. అయినా భారత దేశం భయపడదు. ఏ దేశాన్నీ దయదలచమని బిచ్చమెత్తదు. గెలుపు కొరకు పోరాడలేక పోవడమే మన దోషం. కాని సత్యం చిరంతనమని మనం విశ్వసిస్తాం. ప్రపంచాన్ని భారతదేశం ఆశీర్వదిస్తుంది. ఇదే ప్రపంచానికి మన సందేశం. తనకు కీడు జరిగినా, మంచినే ప్రపంచానికి పంచుతున్నది. అలా భారతదేశంలో జన్మించిన ఒక ఉదాత్త భావాన్ని ఆచరించి చూపుతున్నది. శాంతము, మంచితనము, ఓర్మి, సాధుత్వము చివరికి గెలుస్తాయి. ఇదే భారత సందేశము. లేవిచో, ఒకనాడు ప్రపంచాన్ని శాసించిన గ్రీకులేరి? అంతరించారు. తన పద ఘట్టనంతో ప్రపంచాన్ని కంపిపచేసిన రోమనులేరి? యాభై ఏండ్లలో అట్లాంటిక్ నుండి పసిఫిక్ మహాసముద్రం వరకు తమ ఝుండా నెగరవేసిన ఆ అరబ్బులేరీ? లక్షలాది మనుజులను క్రూరంగా సంహరించిన ఆస్పానియార్డులు ఏరీ? ఆ జాతులన్నీ దాదాపు నశించాయి. కాని భారత మాత సంతానం యొక్కశీలం సార్థకమైనది. దయార్ద్రమైన జాతి ఎన్నడూ నశించదు, ఆమె తన విజయ ముహూర్తాన్ని దర్శించి తీరుతుంది.

ఒకదానివెంట మరొకటిగా అనేక జాతులు ప్రపంచరంగస్థలంలో అవతరించి, క్షణకాలం, తమ పాత్రలను నిర్వహించి, కాల ప్రవాహంలో కనీసం చిరునామా లేకుండా స్మృతిశేషం వదలకుండా అంతరించగా, మనమో-నేటికీ శాశ్వత జీవనాన్ని కొనసాగిస్తున్నాము. ఉత్తమ సామర్థ్యం గలవాడే జీవించి ఉంటాడని ఎన్నో క్రొత్త క్రొత్త సిద్ధాంతాలను వల్లెవేస్తూ కండబలానికే చివరకు మిగలడానికి వీలుంటుందని అంటారు. అదే నిజమైతే అలనాటి దుందుడుకు జాతులలో కనీసం ఒక్కటైనా వైభవోన్నతంగా జీవించి ఉండాల్సింది. అలాగే మనం బలహీన హిందువులం - ప్రపంచంలో కనీసం ఒక జాతిని, ఒక్క తెగను గెల్వని దేశం పూర్తిగా నశించి ఉండాల్సింది. కాని ముప్పది కోట్ల మందిమి నేడింకా మిగిలి సజీవంగా ఉన్నాము. (ఒక ఆంగ్లయువతి "హిందువులు సాధించిదేమిటి? కనీసం మరొక్క దేశాన్నైనా గెలవలేదు అని ప్రశ్నించింది.) కాని భారత శక్తి సర్వస్వం నశించలేదు. శరీరం వైకల్యం చెందలేదు. అది అసత్యం. ఇంకా అపారమైన సామర్థ్యం ఉన్నది. ఆ సమయమాసన్నమైనప్పుడు, అవసరమేర్పడ్డప్పుడు, మహా

ప్రవాహంగా ఉప్పొంగి ప్రపంచాన్ని ఉప్పెనలా ముంచెత్తుతుంది."

ఒకనాడు గ్రీకు సైన్యాల అడుగుల సవ్వడికి ప్రపంచం కంపించింది. నేడు ఆ ప్రాచీన గ్రీకు దేశం అంతరించింది. ప్రపంచపటంలో గుర్తు లేకుండా పోయింది. కనీసం కథలుగా చెప్పుకోడానికైనా మిగలలేదు. ఒకనాడు ప్రపంచంలో చెప్పుకోతగ్గ ప్రతి క్షేత్రాన్ని రోమన్ గరుడ చిహ్నం తన ప్రభావంతో ముద్రించింది. ప్రతిచోట రోమనుల కీర్తిరుచి చూపడం జరిగింది. మానవాళి తలొగ్గి, వారి శక్తికి మోకరిల్లింది. రోము పేరు వినబడితేనే ప్రపంచం కంపించేది. కాని నేడు కాపిటోలైను పర్వతం ఒక శిథిల రాశి. సీజరు చక్రవర్తి కూర్చున్న సింహాసన స్థానంలో సాలీడు గూళ్ళు అల్లుకుంటున్నాయి. అలాగే మహా వైభవాలు వెలయించి, అలా క్షణం కన్పించి మాయమైన దేశాలు, కొన్ని ఘడియలు అమోఘంగా, ఆడంబరంగా ఆధిపత్యాన్ని ప్రదర్శించి, మహా క్రూరంగా జీవించి, నేటి అలలుగా అంతరించి పోయిన దేశాలూ ఉన్నవి. ఈ దేశాలు మానవాళి ఎదలపై ఏమైనా ప్రభావాన్ని ముద్రించినవా? కాని మనం నేటికీ జీవించే ఉన్నాము. మను చక్రవర్తి తిరిగి ఈ నాడు మన మధ్యన జన్మిస్తే ఆయన ఏదో పరాయి దేశంలో పుట్టినానని భావించడు. వేలకొలది సంవత్సరాలలో పరిణామ క్రమంలో తమకు తాము సంతరించుకొన్న అవే న్యాయాలు, శతాబ్దాల అనుభవ పరిణామంగా ఆవిష్కరించుకుని శాశ్వతంగా భాసించే అవే ఆచారాలు, కాలం గడిచినా కొద్దీ, దెబ్బపై దెబ్బ పడుతూన్న కొద్దీ, ఇంకారాటు దేరి, సహిస్తూ భరిస్తూ, మరింత శక్తిమంతంగా మరింత నిలకడగా స్థిరంగా వెలుగొందుతున్నాయి. వీటన్నింటికి కేంద్రీభూతంగా జాతీయ జీవన ఉద్గమ స్థలంగా ఈనాటికీ అదే రక్తం ఈ దేశపు గుండెల్లో ప్రవహిస్తున్నది. ప్రపంచానుభవంతో నేను చెప్పేదిదే.

## అవసరమైన జాతి:

భారత జాతిని చంపగలగడం అసంభవం. తమ ఆధ్యాత్మ భావాన్ని విడనాడ నంతకాలం, పునాదిలో ఆ స్ఫూర్తి ఉన్నంతకాలం, ఈజాతి అలా అజరామరంగా జీవించే ఉంటుంది. బికారులైనా, పేదలై దారిద్ర్య మనుభవిస్తున్నా, మట్టీ దుమ్ము ధూళి శాశ్వతంగా అలముకొన్నాసరే, తాము మహర్షుల సంతానమనే భావనను వారు మరచిపోరాదు. పశ్చిమ దేశాలలో, బజారులో నివసించే

సామాన్యుడు కూడా తన పూర్వ సంబంధాన్ని ఏదో ఒక మధ్య యుగాల దోపిడీ దొరతో కలుపుకుంటాడు. అది అతని పరంపర. అలాగే మన దేశంలో సింహాసనాన్ని అధిష్టించిన చక్రవర్తి యైనా తన వంశ సంబంధాన్ని అడవిలో జీవించి, చెట్టు బెరడులనే వస్త్రాలుగా ధరించి, కందమూలాలు భుజిస్తూ పరమే శ్వరుని సాంగత్యములో జీవించిన ఒక భిక్షుక - సన్యాసితో కలుపుకుంటాడు. ఆ వంశ పరంపరే మనం కోరుకునేది. ఆ పునీత భావాలు అలా పరమోత్తంగా గౌరవింప బడుతూన్నంతకాలం భారతదేశానికి చావులేదు.

భారతదేశం మరణించ వలెనా? అలా జరిగితే ప్రపంచంలో ఆధ్యాత్మ భావం నశిస్తుంది. సంపూర్ణ శీలం నశిస్తుంది. ధర్మం పట్ల ఉండవలసిన మధు హృదయ స్పందన నశిస్తుంది. ఆదర్శ గరిమే నశిస్తుంది. ఆ స్థానంలో స్త్రీ పురుషులే దేవతలుగా, కామ విలాసాల ద్వందం రాజ్యమేలుతుంది. దానికి ధన మాచార్యుడు, మోసము బలిమి, పోటీ పూజలు, మానవాత్మ బలిపశువు: అలా ఎన్నడూ జరుగరాదు. క్రియా శక్తికన్నా సహనశక్తి అపరిమితంగా శ్రేష్ఠమైనది. ద్వేష శక్తి కన్నా, ప్రేమశక్తికి అపరిమితమైన సామర్ధ్యం ఉంటుంది.

నేను పశ్చిమ దేశాలకు వెళ్ళాను. ఎన్నో భూముల్లో, ఎన్నో జాతుల మధ్య పయనించాను. ప్రతి దేశంలో, ప్రతి జాతికీ ఒక ప్రధానమైన జాతీయ ఆదర్శం ఉన్నట్లు నాకు కన్పించింది. అలా ఒక ప్రధాన ఆదర్శం వారి జాతీయ జీవిత మంతటా ప్రవహిస్తూంటుంది. అదే ఆయా జాతులకు వెన్నెముక లాంటిది. రాజకీయాలు, సైనికశక్తి, వాణిజ్యపాటవం, యంత్రాంగ విజ్ఞానం, ఇవేవీ భారతదేశానికి అలాంటి వెన్నెముకగా నిలువలేవు. ధర్మ మొక్కటే మనకున్నది. ఉండాల్సింది. ఆధ్యాత్మమే భారతదేశంలో మొదటి నుండీ విరాజిల్లుతూన్న అధిష్ఠానం.

విరాట్‌ను ఆరాధించండి

## వడలిపోతున్న ఫలం - చిగురిస్తున్న వృక్షం:

ఇది శాశ్వత ధర్మ భూమి. ఈ దేశం దిగజారిన మాట నిజమే. కాని తప్పక తిరిగి లేచి నిల్చుంటుంది. ఆ జాగృత మనో నిశ్చయం ప్రపంచాన్ని ఆశ్చర్యపరుస్తుంది. అరుపులు, రంకెలు వినిపించక పోవుగాక, అది తిరిగి మహోద్యానాలు చేయకతప్పదు.

ఆర్యభూమిలో భారతదేశం అవనతంగా ఎందుకుండాలి? చాతుర్యం తక్కువ అవడం వల్లనా? భారతదేశపు కళాకౌశలాలను, గణితాన్ని, తత్వశాస్త్రాన్ని చూచి కూడా ఆమాట అనగలవా? తనవావేశించిన మాయను తొలగించుకొని, దీర్ఘ నిద్రను విడిచి మేల్కొని, వివిధ జాతులలో తన సముచిత స్థానాన్ని పొందడమే నేటి అవసరం.

ఇచ్చి పుచ్చుకోడమే న్యాయం. భారతదేశం మళ్ళీ లేచి నిలబడాలంటే, తన సర్వ సంపదలను వెలికి తీసి ప్రపంచదేశాలలో వెదజల్లి, ఇతర దేశాలు తన కిచ్చే వాటికి స్వీకరించడానికి సిద్ధమై ఉండాలి.

విస్తరించడం జీవనం - సంకోచం మరణం. ప్రేమ జీవనం - ద్వేషం మరణం. మన ఇతర జాతులను ద్వేషించ నారంభించిన వాటినుండే క్షీణించ నారంభించాము. తిరిగి మనం విజృంభించకపోతే మన మరణాన్ని ఎవరూ ఆపలేరు.

క్షీణదశ, పతనదశ ఈదేశం చవి చూచింది. కాని వాటిని నేను పెద్దగా పట్టించుకోను. వాటిని గురించి మనకు తెలుసు. అలాంటి దశలు అవసరమేమో. ఒక పెద్ద చెట్టున పండు పండి వేలరాలుతుంది. అది జీర్ణించి చిదికి పోతుంది. ఆ చిదికిన పండులోంచి భవిష్య వృక్షపు వ్రేళ్ళు, మొలుస్తాయి. అలా పుట్టిన నూతన వృక్షం ఇతోధికంగా మహాశక్తివంతమైనది కావచ్చు. మనం గడిపిన క్షీణ దశ బహుశః అందుకే అవసరం. ఈ క్షీణదశ లోంచి భవిష్యభారతం ఉద్భవిస్తున్నది, లేచిగుళ్ళు వస్తున్నవి. లేత ఆకులు కన్పిస్తున్నవి. అమిత శక్తి వంతమైన, బ్రహ్మాండమైన, "ఊర్ధ్వమూల" వృక్షం అప్పుడే ఉద్గమిస్తూ కన్పిస్తున్నది.

## సుదీర్ఘ రాత్రి గతిస్తున్నది:

ఆ దీర్ఘరాత్రి గతిస్తున్నట్లు అనిపిస్తున్నది. ఆచేదు బాధలు ఎట్టకేలకు తొలగి పోతున్నట్లు కన్పిస్తున్నది. మృగ్రపాయమైన శరీరం తిరిగి మేలుకొంటు న్నట్లున్నది. చరిత్ర, పరంపర లేవీ తొంగి చూడలేని ప్రాచీన దైన్యదశలోంచి ఒక సందేశం వినిపిస్తున్నది. హిమాలయ సానువుల ఒక్కొక్క శిఖరంలోంచి ధ్వనిస్తున్నట్లు జ్ఞాన, ప్రేమ, కర్మల సందేశాన్ని మన భారతి వినిపిస్తున్నది.

మృదువుగా, దృఢంగా, నిస్పందేహ సామర్థ్యముతోను క్రమంగా స్ఫుటతరమై ఒక మహాధ్వని వినిపిస్తున్నది. అదుగో నిద్రావస్థితుడు జాగృతుడవుతున్నాడు. హిమాలయాల నుంచి వీచిన గాలి తెమ్మెరలా, చచ్చుపడిన ఎముకలలో, కండలలో ప్రాణం నింపుతున్నది. సోమరితనం తొలగిపోతున్నది. మన ఈ మాతృభూమి, నిద్రనుంచి మేల్కొంటున్నదనే వాస్తవాన్ని కేవలం అంధులు మాత్రమే గుర్తించలేరు. భ్రష్టబుద్ధులు గుర్తించరు. ఇక ఆమె నెవ్వరూ నిరోధించలేరు. ఆమె తిరిగి నిద్రించదు. ఆ విశాల వ్యక్తిత్వం తన కాళ్ళలేచి నిల్చుంటున్నది. కనుక ఇక ఏ బాహ్యశక్తి ఆమె ప్రగతిని నిరోధించ జాలదు.

త్యాగం! అంతరిస్తున్న జాతులకు ప్రపంచంలోని క్రౌర్యానికి, దుర్మార్గ ప్రవృత్తికీ ఒకతుది హెచ్చరికలా భారతదేశం ప్రసాదిస్తున్న ఏకైకమైన అమృత సిద్ధాంతం - త్యాగం! ఓ హిందువులారా! ఆపతాకను మీ పట్టునుండి జారిపోనీకండి.

భారత జాతి తిరిగి మేలుకొంటుంది. కాని మాంసల శక్తితో కాదు. ఆత్మ శక్తితో మేల్కొంటుంది. వినాశ పతాకల నెగురవేస్తూకాదు. సన్యాసి ధరించిన దుస్తులకు సంకేతాలైన శాంతి ప్రేమలతో, సంపదల శక్తితో కాదు, భిక్షా పాత్రకున్న సంబలంతో మేము "బలహీనులం" అని ఉచ్ఛరించకండి. ఆత్మ పరమ సామర్థ్యశీలి అని గుర్తించండి.

## నేడు బ్రహ్మాండమైన దృఢ సంకల్పులు కావాలి:

నేడు మనకు, విశ్వ గర్భాన్ని, చీల్చుకొని వింతలను రహస్యాలను వెలికి తీయుగలవారు, సముద్రగర్భానికి చేరవలసి వచ్చినా, మరణాన్ని ముఖాముఖి ఎదిరించ వలసి వచ్చినా చలించని ఇనుప కండరాలు, ఉక్కు నరాలు గల బ్రహ్మాండమైన దృఢ సంకల్ప శీలురు కావాలి.

సోదరులారా! మనం కష్టించి పనిచేద్దాం. ఇది నిద్రించవలసిన సమయం కాదు. భారత భవిష్యత్తు మన పని మీదనే ఆధారపడి ఉన్నది. ఆ తల్లి ఎదురు చూస్తూ సిద్ధంగా ఉన్నది. కేవలం నిద్రిస్తున్నది అంతే. ఆమెను లేపండి, మేల్కొల్పండి - ఈ మన మాతృభూమిని మున్నెన్నడూ కనీవినీ యెరుగని వైభవోజ్జ్వలంగా పునర్జాగృతంగా, శాశ్వతత్వ సింహాసనం మీద అధివసింపచేయండి.

—

మనకు కావలసినది కేవలం చిత్తశుద్ధి. అదెలా లభించడం? మొదట "విరాట్" ను, మన చుట్టు విస్తరించిన సర్వస్వాన్ని ఆరాధించండి. 'worship' అనే దొక్కటే సంస్కృతం లోని "ఆరాధన" శబ్దానికి సరిగా అర్థాన్ని స్ఫురింపచేస్తుంది. ఈ మానవులు - ఈ జంతువులు ఇవన్నీ మన దేవతలు. మొదట మనం మన దేశ సోదరులను ఆరాధించాలి. పరస్పరం అసూయ లేకుండా, పరస్పరం కలహించుకోకుండా, వీరిని మనం ఆరాధించాలి.

## మేల్కొన్న ఈశ్వరుడు:

ఇదే వచ్చేయాభై ఏండ్ల వరకు, మన మాతృభూమి, మనకు అందించే దివ్య సందేశం. మిగతా వ్యర్థ దేవతల నందరినీ మీ మెదళ్ళలోంచి తొలగించండి. ఇదొక్కటే మన దైవం - సర్వత్రా వ్యాపించిన బాహువులతో, సర్వత్రా వ్యాపించిన చరణాలతో, సర్వత్రా వ్యాపించిన చెవులతో - అంతటా నిండియున్న మన జాగృత సమాజం - మన దైవం. మన నలువైపుల నున్న ఈ "విరాడ్దైవాన్ని" విడిచి ఏ వృధాదేవుణ్ణి ఆరాధిస్తావు? ఈ దైవాన్ని ఆరాధిస్తే, మిగతా దేవతలనందరినీ ఆరాధించినట్లే.

ఓనా దేశవాసులారా! నా మిత్రులారా! ఈ మన ఈ జాతి కాక అనేక కోట్లాది జీవులను, జీవన జలధిని తరింప చేస్తున్నది. గతంలో అనేకవేల శతాబ్దాలు అలా ఆవలి గట్టుకు, ధన్య జీవన తీరాలకు, తన ద్వారా కోట్లాది ప్రజలను చేరుస్తూనే వచ్చింది. కాని నేడు ఆనౌక కొద్దిగా దెబ్బతిన్నది. ఒక చిన్న రంధ్రమేర్పడింది. అందుకని దానిని దూషిస్తావా? ప్రపంచంలో అనితరమైన మహత్తును సాధించిన ఈ భూమిని శాపనార్థాలు పెడతావా? ఈ జాతీయ నౌకకు రంధ్ర మేర్పడితే ఈ సమాజ సంతానమైన మనం కలిసి పురోగమిద్దాం. ఆ రంధ్రాలను పూడుద్దాం. మన గుండెనెత్తురు పిండైనా సరే. సంతోషంతో ఆ గండిని నింపుదాం.

నేను భవిష్యత్తుకొరకు అర్రులు చాచను. అలా చూడాలని నాకెపుడూ లేదు. నిండు జీవనంలా నేడు ఒక భవిష్య దృశ్యాన్ని దర్శిస్తున్నాను. మన సనాతన భారతమాత తిరిగి మేల్కొన్నది. ఆమె తన పునర్జాగృత సింహాసనం మీద విరాజిల్లుతున్నది. ఆమె వైభవం ఇతోధికంగా ప్రకాశిస్తున్నది. శాంతి, అభయాలతో ఆమె యశస్సును ప్రపంచానికి చాటండి.

## ప్రబుద్ధ భారతి: ఓ భారతీ!

ఓ భారతీ! కేవలం ఇతరుల ప్రతిధ్వనిగా, ఇతరుల అల్పమైన అనుకరణంతో, ఇతరులపై ఆధారపడి ఈ బానిస దౌర్బల్యంతో, ఈ అసహ్యపు తిరస్కార పాత్రమైన క్రూరబుద్ధితో, ఈ లక్షణాలతో వైభవోత్తుంగ శిఖరాలను, సభ్యతా శృంగారాలను చేరగలవా? ధైర్య శీలురూ, వీరులూ, పొందగల స్వాతంత్ర్యాన్ని ఈ అవమానకరమైన పిరికి తనంతో సాధించగలవా? ఓ భారతీ! నీ ఆదర్శం, సీత, సావిత్రి, దమయంతి, అనే వాస్తవాన్ని మరవకు. నీవు ఆరాధించేది తాపసోత్తముడైన, ఉమాధవుడైన - సర్వసంగ పరిత్యాగియైన శంకరుణ్ణి. నీ వివాహము, నీ సంపదా, నీ జీవనము కామ కేళికి కాదు. నీ స్వీయానుభవానికి కాదు. నీ జన్మ, ఆ తల్లి వేదిక మీద సమర్పింపబడటానికి లభించిందనే మాట విస్మరించకు. ఆ జనజ్జనిని స్వరూప ప్రతిబింబమే ఈ నీ సమాజవ్యవస్థ అనే మాట మరువకు. క్రింది తరగతులు, మూఢులు, పేదలు, విద్యా విహీనులు, చర్మకారులు, సమ్మార్జకులు, నీ రక్తాన్ని పంచుకొని, నీ కండలో కండగా పుట్టిన సోదరులే, ఓయీ ధైర్యశాలీ! దృఢంగా నిల్చో, ధైర్యాన్ని పుంచుకో! భారతీయులైనందుకు గర్వించు "నేను భారతీయుడను. ప్రతి భారతీయుడు నా సోదరుడే" నని ఉద్ఘోషించు. మూఢ భారతీయుడు, పేదవాడు, దిక్కు లేని భారతీయుడు, బ్రాహ్మణ భారతీయుడు, పాకీ భారతీయుడు ఇక్కడి ప్రతివాడూ నా సోదరులే అని ఎలుగెత్తి చాటు. నీవు కూడా పీలికలు ధరించిన వాడివైనా, నీ ఉదాత్త కంఠంతో, ప్రతి భారతీయుడు నా సోదరుడు. నా జీవితము భారతీయము. భారతీయ దేవీ దేవతలు నాకు ఆరాధ్యులు, భారతదేశం నా శైశవ డోలి, నా యౌవ్వన విలాసపుష్పోద్యానం, నా వృద్ధాప్యపు పవిత్రస్వర్గం, పుణ్యస్థలి కాశి నా భారతదేశం" అని ప్రపంచానికి చాటిచెప్పు. "భారతదేశపు మట్టి నా పరమోన్నత స్వర్గమని భారతి సంక్షేమమే నా సంక్షేమమని ప్రకటించు. అహర్నిశలు "ఓ గౌరీ పరమేశ్వరా! ఓ జగజ్జననీ! నాలో పౌరుషాన్ని నింపండి. నాలోని కాపురుషత్వాన్ని తొలగించండి. నన్ను పురుషార్థినిగా దీవించండి" అని పదే పదే స్మరిస్తూ, ప్రార్థించు.

జాగృత భారతీ! మరొక్కసారి మేలుకో!

అది మృత్యువు కాదు. పునర్నవజీవనాన్ని స్వాగతించడానికి, నిమీలిత

కమల నయనాలలో, సాహసోపేతల స్వప్నాలు కనడానికి ఉపకరించే, నిద్ర మాత్రమే. ఓ సత్యమా! ఆర్ద్ర ప్రపంచం నీపై ఎదురు చూస్తున్నది! నీకు మరణం లేదు.

నీ పయనాన్ని తిరిగి సాగించు.

ఓయి ప్రబోధకా! దారి ప్రక్కన అణగి పడిఉన్న రజః కణపు విశ్రాంతికి కూడా భంగం వాటిల్ల నంతటి సవ్వడి లేని అడుగులతో - కానీ స్ఫుటంగా, స్థిరంగా, అభయపూర్ణంగా, ధైర్యంతో స్వేచ్ఛగా - ముందుకు సాగు, గుండెల కదలించే నీ కంఠాన్ని వినిపించు -

***

**

*

# విశ్వధర్మము - హిందూ సహిష్ణుత

ఒక్కమాట....

విశ్వధర్మము యొక్క ఆదర్శాన్ని వివరిస్తూ స్వామి వివేకానందులు ఇలా అన్నారు:

"విశ్వ సౌభ్రాతృత్వాన్ని గురించి, దానినే ప్రత్యేకించి ప్రబోధించే సమాజాల గురించి మనం వింటుంటాము. నాకో పాత కథ జ్ఞాపకం వస్తోంది. భారతదేశంలో సారాయి త్రాగడం చెడుగా భావిస్తారు. ఓ ఇద్దరు సోదరులు ఓ రాత్రి రహస్యంగా సారాయి త్రాగుదామని మోజుపడ్డారు. వారికి పక్కగదిలోనే వారి చిన్నాన్నగారు పడుకున్నారు. ఆయనేమో గట్టి ఆచారపరుడు. కనుక త్రాగడానికి ముందు వారిద్దరూ ఒకరికొకరు ఇలా కూడబలుక్కున్నారు. 'మనం చాలా నిశ్శబ్దంగా ఉండాలి సుమా! లేకపోతే చిన్నాన్నగారు లేస్తారు' అని. ఇక త్రాగుతూ కూడా ఇవే మాటలు మళ్ళీ మళ్ళీ అంటూ పోయారు. 'నిశ్శబ్దం, చిన్నాన్నగారు లేస్తారు!' ఒకరిని మించి ఒకరు ఇలా అంటూండడంతో అల్లరి పెరిగిపోయి చిన్నాన్నగారు లేవనేలేచారు. నేరుగా గదిలోకి వచ్చి జరుగుతున్నదంతా చూశారు. ఇప్పుడు మనమూ యిలాగే, ఈ త్రాగుబోతులవలెనే 'విశ్వ సౌభ్రాతృత్వం' అంటూ కేకలు వేస్తున్నాం!....."

*వివేకానంద సంపూర్ణ గ్రంథావళి II పుట 379-380*

ఇక మీరు 'విశ్వ సౌభ్రాతృత్వం' అన్నచోట 'లౌకికవాదము' (సెక్యులరిజం) అన్నమాట చేర్చితే, అది సరిగ్గా ఈనాటి భారత రాజకీయరంగం లోనికే మిమ్మల్ని దించుతుంది. వంద సంవత్సరాల క్రితం పూజ్య స్వామీజీ ఆ మాటకు సొందిన స్పందనే నేటికీ సరిపోలి వుండడం ఎవరైనా గమనించవచ్చు. భవిష్యవాణిలా అది సరిపోలిందనవచ్చు. అయితే అసలైన సౌభ్రాతృత్వము, సహనము, సమరసత, సహజీవనము- వీటి మూల విలువలను, ప్రపంచ చరిత్ర చాటిచెప్పిన వాటి నిజమైన రక్షకులను తెలుసుకోవాలంటే ఈ పుస్తకంలోని స్వామివారి భావాలు ఎంతో దోహదం చేయగలవని భావిస్తున్నాము. అదే ఆశయంలో ఈ చిన్న సంకలనాన్ని మీ ముందుంచుతున్నాము.

## వేదాంతము సూత్రాలపై ఆధారపడింది

ప్రపంచంలోని ప్రతి మతస్థు తమ మతానికి సంబంధించి ఏవేవో విచిత్రమైన గొప్పలు చెప్పుకోవడం నేను తరచుగా వింటున్నాను. ఒక నా మంచి మిత్రుడు డా॥ బారోప్ * ఇటీవలే క్రైస్తవ మతమొక్కటే విశ్వమతమని బల్లగుద్ది చెప్పడం మీరు వినే ఉంటారు. ఇదే విషయాన్ని ఒకింత మీ ముందుంచుతాను. అంతేగాక వేదాంతము, వేదాంత మొక్కటే విశ్వమాన ధర్మం కాగలదని, మరే మతమూ అందుకు సరితూగలేదన్న నా నిశ్చితాభిప్రాయానికి తగు కారణాలను కూడా వివరిస్తాను. మేము తప్ప దాదాపు గొప్ప గొప్ప ప్రపంచ మతాలన్నీ తప్పనిసరిగా వారి వారి మత స్థాపకుల, వారు ఒకరే కావచ్చు అనేకులు కావచ్చు జీవితాలతో ముడిపడి వున్నాయి. వారి సిద్ధాంతాలు గాని, ప్రబోధాలు గాని, సందేశాలు గాని, నీతి నియమాలు గాని ఆ సంస్థాపకుని వైయ్యక్తిక జీవితం చుట్టూ అల్లబడినాయి. అక్కడి నుండే వాటికి అనుమోదాన్ని, అధికృతిని, శక్తిని వారు పొందుతున్నారు. ఆశ్చర్యకరంగా ఆ మతాల కూర్పు అంతా అటువి జీవితపు చారిత్రక శీలతపై ఆధారపడివుంటుంది. అయితే అట్టి జీవితం యొక్క చారిత్రాత్మకతపై ఒక్క వేటు పడిందంటే, అత్యంత దృఢమైందని ప్రగల్భాలు పలికే ఆ చారిత్రిక కొండశిల పునాదులు కదిలిపోయి, తునాతునకలై, పునర్నిర్మాణం సాధ్యం కానంతగా ఆ సౌధం కుప్పకూలిపోతుంది. ఆధునిక యుగంలో దాదాపు అట్టి మతాలన్ని సంస్థాపకుల జీవితాల విషయంలో ఇదే జరిగింది. అలాంటి జీవన విశేషాలలో సగానికి సగం ఎవరూ అంతగా నమ్మడం లేదు. ఇక మిగిలిన సగం తీవ్రమైన సందేహాలకు లోనైనాయి.

మనది తప్ప ప్రపంచంలోని మహా మహా మతాలన్నీ అలాంటి చారిత్రిక వ్యక్తుల జీవితాలు ఆధారంగా నిర్మాణమైనాయి. మనది అలా కాదు. మన ధర్మం సూత్రాలపై ఆధారపడింది. వేదాలకు సృష్టికర్త ఫలానా అని ఏ స్త్రీనిగాని, పురుషుడిని గాని సూచించలేము. అవి శాశ్వత సూత్రాలకు

---

* చికాగాలోని మొదటి ప్రెస్బిటేరియన్ చర్చి యొక్క ప్రబోధకుడైన రెవరెండ్ జాన్ హెన్రీబారోస్ 1893లో జరిగిన ప్రపంచ మత మహాసభ యొక్క ప్రధాన కార్యసమితికి అధ్యక్షుడు.

సంపుటీకరణలు. ఋషులు వాటిని కనుగొన్నారు. అక్కడక్కడ కొందరు ఋషుల పేర్లు ప్రస్తావించబడతాయి. కేవలం పేర్లు మాత్రమే. వారెవరో, ఏమి చేస్తుండేవారో మనకేమీ తెలియదు. వారిలో చాలామంది తల్లిదండ్రులెవరో తెలియదు. దాదాపు అందరికీ సంబంధించినవారు ఎప్పుడు ఎక్కడ పుట్టారో కూడా తెలియదు. అయితే ఈ ఋషులెవరూ తమకు పేరు ప్రఖ్యాతులు ఆశించలేదు. అసలు వాటి విషయమే పట్టించుకోలేదు. వారు సూత్రాలను ప్రబోధించారు. అంతే ఆ సూత్రాలకు తమను తామే స్వయంగా జీవిత ప్రతిరూపాలుగా మలచుకొన్నారు. అవ్యక్తుడైన పరమేశ్వరుడు వ్యక్తరూపాన్ని కూడా ధరించినట్లే మన ధర్మం కూడా వ్యక్తిత్వాలకు అతీతమే అయినప్పటికీ, సూత్రాలే ఆధారంగా నిర్మితమైనప్పటికీ వ్యక్తీకరణకూ అనంతమైన అవకాశాన్ని ప్రసాదిస్తుంది. అందుకే ఈ ధర్మం అనేక అవతారాలను, ప్రవక్తలను, ఋషి మునివర్యులను జాతికి అందించింది. ఇంకా అనంతంగా అందించడానికి కాచుకొని ఉంది.

## అనంతమైన అవతారాలు

అవతారాలు అనంతమని భగవద్గీత చెబుతోంది. అలా చెప్పడంలో ఎన్నంటే అన్ని రావడానికి పూర్తి ఆస్కారం కలిగిస్తోంది. కనుక భారత ధార్మిక చరిత్రలో ఎవరో కొందరు వ్యక్తులు కాని, ప్రవక్తలు గాని, ఏవో కొన్ని అవతారాలు గాని చరిత్ర గీటురాయికి నిలబడకపోతే, అలా జరిగినంత మాత్రాన మన ధర్మానికేమీ హాని కలుగదు. అప్పటికీ అది ఎప్పటివలె పటిష్ఠంగానే ఉంటుంది. కారణం అది వ్యక్తులపై గాక సూత్రాలపై నిర్మితమైంది.

ఒకే వ్యక్తి చుట్టూరా ప్రపంచ ప్రజలందరినీ కూడగట్టుకు రావాలని ప్రయత్నించడం కేవలం వృథా ప్రయాస. శాశ్వతమైన, విశ్వజనీనమైన సూత్రాల చుట్టూ కూడా వారిని కూడగట్టడం అత్యంత శ్రమతో కూడిన పనే. మహా అయితే మానవాళి యొక్క అధిక భాగాన్ని ఒకవేళ ఒకే ధర్మచింతన పరిధిలో తేగలిగినా అది సూత్రాల ద్వారానే తప్ప వ్యక్తుల ద్వారా కాదన్నది గుర్తుంచుకోండి. అయినప్పటికీ మన ధర్మంలో సాధికారికతనూ, వ్యక్తి ప్రభావానికి కావలసినంత అవకాశం ఉంది. ఆశ్చర్యకరమైన ఇష్ట సిద్ధాంతం మనకొకటి ఉంది. దాని మూలంగా ఈ ధార్మిక మహావ్యక్తులలో ఎవరినైనా పరే పరిపూర్ణమైన స్వేచ్ఛతో ఎంచుకోగలిగిన అవకాశం నీకు అందించబడింది. నీ ప్రత్యేక భక్తి శ్రద్ధలకు ప్రతీకంగా, నీకు మార్గదర్శకులుగా ఇంతమంది ప్రవక్తలు, ప్రబోధకులలో

ఎవరినైనా నీవు స్వీకరించవచ్చు. అంతేకాదు నీవు ఎన్నుకొన్న ఆ మహావ్యక్తిని ప్రవక్తలలో కెల్ల గొప్ప ప్రవక్తయని, అవతారాలన్నింటిలోనూ పరమశ్రేష్ఠమైన అవతారమని నీవు భావించుకొనే స్వేచ్ఛ కూడా నీకు యివ్వబడింది. అందువల్ల జరిగే హాని ఏదీ లేదు. అయితే శాశ్వతమైన సత్య సూత్రాల నేపథ్యంలో నీ పరిపూర్ణమైన శ్రద్ధ మాత్రం నెలకొని ఉండాలి.

ఇక్కడ గమ్మత్తైన ఓ వాస్తవం ఏమంటే వేద ప్రణీతమైన సూత్రాలకు ప్రతిరూపాలైనంత మేరకే మన అవతారాల యొక్క శక్తి సామర్థ్యాలు మనకు వచ్చుతాయి. శాశ్వత ధర్మ సూత్రాల ప్రబోధకుడుగా, అత్యుత్తమ వేదాంత వ్యాఖ్యాతగా భారతభూమిలో రూపొందిన ఓ అపురూపమైన వ్యక్తి శ్రీకృష్ణుడు. అదే అతని మహనీయత.

## అన్ని ఆదర్శాలకు ఆటపట్టు

అతడిలా అన్నాడు: "ఏ బయటివ్యక్తి ద్వారానైనా, ఎలాంటి మహాద్భుత ఆధ్యాత్మిక శక్తి ప్రకటీకృతమైనా, నేనే అట నున్నానని, నా నుండే ఆ శక్తి ప్రకటీకరింపబడుతున్నదని తెలుసుకో" ప్రపంచంలోని దేశాలన్నింటిలోనూ ప్రకటితమైన అవతారాలన్నింటిని పూజించేందుకు హిందువుకు ఈ వాక్యం ద్వారాలను తెరుస్తున్నది. అలా ఏ దేశానికి చెందిన ఏ సాధు సన్యాసినైనా హిందువు ఆరాధించగలడు. అందుకే మనం ఎన్నోసార్లు క్రైస్తవుల చర్చీలలోకి వెళ్ళి, మరెన్నోసార్లు మహమ్మదీయుల మసీదులలోకి వెళ్ళి పూజించాము. అది మంచిదే. తప్పేముంది? నేనిదివరకే అన్నాను మనది విశ్వధర్మం అని. సకల ఆదర్శాలనూ ఆకళింపు చేసుకోగల విశాలత దీనికి ఉంది. ప్రపంచంలో ఇప్పటికే వున్న సకల మతాల ఆదర్శాలనూ తక్షణం ఈ ధర్మంలో కలుపుకోవడమే కాక భవిష్యత్తులో రాబోవు ఆదర్శాలన్నింటినీ అదేవిధంగా ఆకళించుకొనేందుకై వేచి ఉండే సహనశీలత, వాటిని ఆలింగనం చేసుకోగలిగిన ఆత్మీయత ఈ వేదాంత ధర్మం యొక్క అనంత బాహువుల్లో నిక్షిప్తమై ఉంది.

## ఒకే పద్ధతి అందరికీ కూడదు

తత్పరిణామంగా- ఒకవైపున ఏ కారణమూ లేకుండా తమంతట తాముగా తమవైన పునాదులపై దృఢంగా నిలిచిన శాశ్వత సూత్రాలున్నాయి. అవి ఎంతటి మహర్షుల లేదా ఎంతటి మహాద్భుత అవతారాల కర్తృత్వశక్తికీ లోబడి లేవు. కనుక భారతదేశంలో గల ఈ విశిష్టస్థితి బట్టి వేదాంతమే విశ్వధర్మము

కాగలదని, అది యిప్పటికే ప్రపంచమంతటా విశ్వధర్మంగా వెలుగొందుతున్నదని మేము నొక్కి చెబుతున్నాము. ఒక వ్యక్తి ఆధారంగా నిర్మితమైన ఏ మతమూ మానవ జాతులన్నింటికీ ఏకంగా సరిపోయే పద్ధతి కాదు. మా స్వదేశంలో సైతం ఎందరెందరో మహాత్ములున్నారు. ఓ చిన్నపాటి పట్టణంలో కూడా ప్రజలు వారి వారి బుద్ధి, ఆలోచనల ప్రకారం ఎన్నెన్నో పద్ధతులు అవలంబిస్తారు. ప్రపంచం యావత్తూ ఒకే ఒక వ్యక్తినే - మహమ్మదునో, బుద్ధుడినో, క్రీస్తునో మాత్రమే అనుసరించడం ఎలా సాధ్యం? ఆ ఒక్క వ్యక్తి అంగీకారంపైనే సమస్త నైతిక విలువలు, నీతి ధర్మాలు, ఆధ్యాత్మికత, మతము అన్నీ ఆధారపడి వున్నాయా?

## సమాన సూత్రాల పునాదిపై

ఆసియాలో ధార్మిక ఆదర్శాలే జాతీయ సమైక్యతను రూపొందిస్తాయి. అందువల్ల భారత భవిష్యత్తుకై మొట్టమొదట ధార్మిక సమైక్యత అత్యంత ఆవశ్యకమైన అంశం. ఆ మూలనుండి ఈ మూలవరకూ దేశవ్యాప్తంగా ఒకే ధర్మం గుర్తింపబడి వుండాలి. ఒకే ధర్మం అనడంలో నా ఉద్దేశ్యం క్రైస్తవులు, మహమ్మదీయులు, బౌద్ధులు భావించినట్లు ఒకే మతం కాదు. మన ధర్మానికి, దాని నుండి ఆవిర్భవించిన వివిధ సంప్రదాయాలకు- అవి ప్రతిపాదించే తత్త్వాలు వేరు వేరైనా, వాటి నిష్కర్షలు ఏవైనా- అన్నింటికీ సమానమైన పునాదులున్నాయి. ఒకే ఆధారంపై అవి నిలుచున్నాయి. కనుక కొన్ని సమానమైన ఆధారాలతో ఆ పరిమితులకు లోబడి అద్భుతమైన విభిన్నతలు, వేర్వేరు ఆలోచనలకు, జీవనగతులకు అనంతమైన స్వేచ్ఛ మన ధర్మం అనుమతించింది. మనలో విచారశీలురైన కొందరికైనా ఇది తెలుసు. మన ధర్మంలోని ఈ సమాన జీవన సూత్రాలను మనం వెలికి తీయాలి. ఈ దేశపు మూలమూలలా నివసించే ఆడ, మగ ఆబాలగోపాలం ఇవి తెలుసుకోవాలి- అర్థం చేసుకోవాలి. వారి వారి జీవితాలలో వాటిని రంగరించుకోవాలి. ఇది మొదటి మెట్టు. కనుక దీనిని తప్పక చేపట్టాలి.

# హిందూ సహిష్ణుత

## సహనశీల ధరణి భారతమొక్కటే:

ప్రపంచ దేశాలన్నిటిలో భారత్ ఒక్కటే సహనశీలతకు, ఆధ్యాత్మికతకు మారుపేరుగా నిలచింది. అందువల్లే జాతులకు వాటి దేవతలకు మధ్య సంఘ

ర్షణలు ఇచ్చుట రాలేదు. అతి ప్రాచీనకాలంలో సైతం భారత్‌లో - చరిత్రకు అందని రోజులలోనే, పరంపర ఇంకా తొంగిచూడని దశలోనే - అలనాటి మహర్షులు "ఏకం సత్ విప్రా బహుధా వదంతి" అని ఎలుగెత్తి చాటారు. "ఉన్నది అతడొక్కడే. ప్రాజ్ఞులు అనేకరకాలుగా అతనిని సంబోధిస్తారు". అవిస్మరణీయమైన ఉద్ఘోషిత వాక్యాలలో, అద్భుతమైన ఆవిష్కృత సత్యాలలో ఇది అత్యంత ప్రధానమైనది.

'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' అన్న ఈ ఉదాత్త భావన తరత రాలుగా మన జాతీయ జీవనంతో కొనసాగుతూ మరింత పరిణతి చెంది, పరిపూర్ణతనొంది హిందువులమైన మన జాతీయ అస్మితతో పెనవేసుకొని, మన రక్తంలో కలిసిపోయి మనతో తాదాత్మ్యం చెందింది. ఈ అద్భుత సత్యమే మన నరనరాలలో ప్రవహిస్తోంది. అందువల్లే మన ఈ భూమి మత సహనానికి మారుపేరుగా భాసిల్లింది. మన ధర్మాన్ని నిరసించే లక్ష్యంతో వచ్చిపడిన అనేక ఇతర మతాలు తమ గుళ్లు గోపురాలను, చర్చిలను కట్టుకోగలిగినది ఇచ్చట మాత్రమే. ప్రపంచమంతా మన నుండి ఈ పరమ సూత్రాన్ని నేర్చుకోడానికే కాచుకొని ఉంది. పర దేశాలలో ఎంత అసహనం తాండవిస్తోందో మీకు తెలుసునా!

పరాయిదేశాలకు వెళ్ళి మహమ్మదీయులనో, అన్యమతస్థులనో మీకోసం ఒక దేవాలయం కట్టించి ఇవ్వమని అడగండి. వారి స్పందన ఎలా ఉంటుందో గమనించండి. మీ మాట వినడం అటుంచి వెంటనే వారు మీ కణతలు చిట్లిస్తారు, మీ గుడినీ మిమ్మల్నీ కూడా సాధ్యమైతే ముక్కలు ముక్కలు చేసేస్తారు.

నాలోని ఈ గూడుకట్టిన మత సహనం కారణంగా ఈ సుదూర విదేశీ తీరాలలో నా ప్రాణాలే కోల్పోవలసి వస్తుందేమోనని నాకెన్నోసార్లు అనిపించింది. మతం కోసం మానవ హత్యలు వారికో లెక్కకాదు. ఈరోజు అంతపని వారు చేయడం లేదులే అనుకొన్నా ఆధునిక నాగరికతా ప్రతీకమైన పాశ్చాత్య ప్రపంచం రేపైనా ఆ పని చేయవచ్చు. తన దేశపు అంగీకృత మతానికి వ్యతిరేకంగా ఒక్కమాట వినిపించినా పాశ్చాత్యుడు అత్యంత భీకరంగా ఆ వ్యక్తి పట్ల వ్యవహరించి బహిష్కరించగలడు. మన కులాలు, వాటి కట్టుబాట్లను గురించి ఇక్కడైతే వారెంతో బాహాటంగా, ధారాళంగా విమర్శిస్తారు. కాని నాలాగా మీరూ పాశ్చాత్యదేశాలకు వెళ్ళి కొంతకాలం ఉంటే, అచ్చటి మహా

మహా పండితులలో కూడా మత విషయాల్లో తాము నమ్మిన సత్యాన్ని వందవ వంతు కూడా ప్రజాభిప్రాయానికి వెరచి బయటికి చెప్పలేని పిరికిపందలున్నారని మీరు తెలుసుకుంటారు.

## ఈ మహోదాత్త భావనకై విశ్వం వేచి ఉంది

అందువల్ల విశ్వ సహిష్ణుత అనబడు ఈ మహోదాత్త భావనకై విశ్వం వేచి ఉంది. అది నాగరికతకు ఓ పెన్నిధి వంటిది. నిజానికి ఈ భావన లేకుండా ఏ నాగరికత ఎక్కువకాలం మనలేదు. మతమౌఢ్యము, రక్తపాతము, క్రౌర్యము ఆగనిది ఏ నాగరికత అభివృద్ధి చెందజాలదు. పరస్పరము మనము సానుభూతిపూర్వక దృక్కులలో చూడనిదే ఏ నాగరికత తన తల పైకెత్తలేదు. ఇతరుల మత విశ్వాసాల పట్ల ఉదారంగా, సానుభూతిపూర్వకంగా వ్యవహరించడమే అత్యంత ఆవశ్యకమయిన ఈ సానుభూతి యొక్క ప్రథమ సోపానము. అంతేకాదు అలా సానుభూతి వహించుటే కాదు, మన మత భావాలు, విశ్వాసాలు ఒకదాని కొకటి ఎంత వ్యత్యాసము కలిగి ఉన్నప్పటికీ పరస్పరము సహాయ సహకారము లందించుకోవాలి. భారతదేశములో సరిగ్గా ఇలాగే- నేను ఇప్పుడు చెప్పినట్లే జరుగుతుంది. ఇక్కడ ఈ భారతదేశంలో హిందువులు క్రైస్తవులకు చర్చీలు, మహమ్మదీయులకు మసీదులు కట్టించి ఇచ్చారు, ఇంకా కడుతూనే ఉన్నారు. ఇదే అసలు చేయవలసిన పని. వారెంత ద్వేషించినా, ఎంత క్రౌర్యాన్ని ప్రదర్శించినా, ఎన్ని దుర్భాషలాడినా మనం వారికోసం చర్చీలను, మసీదులను వారి హృదయాలను జయించేంతవరకు కట్టించి ఇస్తూనే ఉంటాము. అలా ప్రేమ ఒక్కటే శాశ్వతంగా నిలిచి ఉండే అర్హత గలదనీ - ద్వేషం కాదని, సౌమ్యత కొక్కటే జీవశక్తి, ఫలదీకరణ శక్తి గలదు తప్ప క్రౌర్యానికి, పాశవిక భౌతికశక్తికి కాదని మనం ప్రపంచానికి చాటి చెబుతుంటాము.

## సహనశీలత యొక్క పుష్పాలు, ఫలాలు:

అన్నిటికన్నా భారతదేశం ప్రపంచానికి ఇవ్వవలసింది ఇది. విభిన్న జాతులలో మతాల పెరుగుదలను, ప్రగతిని మనం నిరీక్షిస్తే ప్రతి జాతికి ఆదిలో ఒక దేవుడున్నట్లు గమనిస్తాము. జాతులు పరస్పరం మైత్రీపూర్ణమైనవైతే బాబిలోనియన్ దేవతలకు వలె వారి దేవతలకూ ఒక పరంపరాగతమైన పేరు ఉంటుంది. బాబిలోనియన్‌లు అనేక జాతులుగా విడిపోయినప్పుడు వారికి 'బాల్' అనే పరంపరాగత నామం ఉండేది. అలాగే యూదు జాతుల

వివిధ దేవతలకు సర్వసాధారణమైన 'మోలోచ్' అని పేరుండేది. అయితే ఈ జాతులలో ఒకటి మిగిలినవాటికన్న బలం పుంజుకొని ఆధిపత్యం పొందితే తమ రాజు మిగిలినవారిని మించిన మహారాజని ఆ జాతి ప్రకటిస్తుంది. ఇక దానితో తమ దేవతయే మిగిలిన వారి దేవతలకన్న శ్రేష్ఠమైనదని ఘోషిస్తారు. బాల్-మెరోడాచ్ మాత్రమే గొప్పదేవత అని బాబిలోనియన్లు ప్రకటించారు. మిగిలిన దేవతలన్నీ తక్కువస్థాయివే అని తేల్చేశారు. మోలోచ్ దేవతలలో 'మోలోచ్-యాహవే'యే గొప్ప దేవతని అన్నారు. అయితే ఈ ప్రశ్నలన్నిటికీ సమాధానాలు నిర్ణయమయ్యేది రణరంగంలోనే. యుద్ధ ఫలితాలే ఆ నిర్ణయం చేస్తాయి. ఆ పోరాటం ఇక్కడా ఉంది. భారతదేశంలోనూ దేవతలు పెద్దరికం కోసం పరస్పరం పోరాడుకున్నారు. అయితే ఈ దేశం యొక్క గొప్ప అదృష్టం ఏమంటే - అది ప్రపంచపు అదృష్టం కూడాను- ఈ గందరగోళం, ఆందోళన మధ్యలో అకస్మాత్తుగా గొంతెత్తి ఓ అశరీరవాణి వినిపించింది 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి'. 'ఉన్నది ఒక్కటే; ప్రాజ్ఞులు వివిధ నామాలతో దానిని పిలుస్తారు' అని. శివుడు విష్ణువు కంటె గొప్పవాడని కాదు; విష్ణువే సర్వస్వము శివుడు ఏమీలేనివాడనీ కాదు. అతడు అతడే- శివుడన్నా, విష్ణువు అన్నా మరే వందలాది పేర్లతో పేర్కొన్నా అతడు ఒక్కడే. పేర్లు వేరు తప్ప అతడొక్కడే. భారతదేశ చరిత్రనంతా ఈ వాక్యాలలో అర్థం చేసుకోవచ్చు. భాషాశాస్త్రం యొక్క విచిత్రశక్తితో చర్విత చర్వణంగా తయారైన కుప్పలు కుప్పలుగా గల చరిత్ర సర్వమంతా ఈ మూల సందేశం చుట్టే నిర్మాణమయింది. ఈ జాతి రక్తంలోకి ఎక్కేంతవరకు ఆ వాణి మరల మరల మారు మ్రోగింది. జాతి నరాలలో ప్రవహించే ప్రతి రక్తపు చుక్క ఆ భావానుభూతి పొందేవరకు, జాతి జీవితం యొక్క అణువణువుతో ఆ వాణి తాదాత్మ్యం చెందేవరకు అలా ఆ అశరీరవాణి ప్రతిధ్వనించింది. చివరకు ఈ దేశం సహనశీలతకు ప్రతీకమైన అత్యద్భుత దేశంగా రూపాంతరం చెంది, వివిధ మతాలను, జాతులను తన సనాతన, చిర పురాతన మాతృభూమికి స్వాగతించగల అర్హతను పొందింది.

## ఆత్మిక దాహాన్ని తీర్చడానికే మతాలు

కొందరు ఆధునికుల ఇష్టాలోచనల వలె మతాలు, జాతులన్నవి ఎవరో కపటుల లేదా క్రూరాత్ములు తమ ధన సంచయ తృష్ణలో భాగంగా ఆవిష్కరించినవి కావు. వారి ఆరోపణ ఎంత నిజమని భ్రమింపజేసినా అది కానే కాదు. అలా అవి ఆవిష్కరింపబడినవి కానే కావు. మానవ ఆత్మ

యొక్క అవసరాలకు అనుగుణంగా అవి ఆవిర్భవించాయి. కాదనలేని మానవ మస్తిష్కాల దాహాన్ని, జిజ్ఞాసను వాటి స్థాయీభేదాన్ననుసరించి, తృప్తిపరచడం కోసం అవి ఏర్పడ్డాయి. ఆ అవసరం సమాప్తమైన రోజున ఆ అవసరంతో పాటే అవీ గాలిలో కలిసిపోతాయి. ఆ అవసరమున్నంత వరకు మీరెన్ని బోధలు చేసినా, ఎన్ని విమర్శలు చేసినా అవి ఉండే తీరతాయి. కత్తులనూ, తుపాకులనూ మీరు రంగంలోకి దింపవచ్చు, ధరాతలాన్నంతా మానవ రక్తంలో ముంచివేయవచ్చు అయినప్పటికీ ప్రతిమల అవసరం ఉన్నంతవరకూ అవి ఉండాల్సిందే. ఈ రూపాలు, మతాలలోని విభిన్న అంశాలు. అవి అలాగే ఉంటాయి. అవి అలా ఎందుకు ఉండాలో శ్రీకృష్ణ భగవానుడే స్వయంగా వివరించాడు.

ధర్మాన్ని పునఃప్రతిష్ఠ గావించేందుకై ఆయా యుగావసరాలు, సమాజము యొక్క ఆవశ్యకతలను బట్టి మహాపురుషులు (మానవాళి యొక్క మహాప్రబోధకులు) వస్తుంటారు. వారిని మహా పురుషులన్నా అవతారాలన్నా పెద్ద తేడా లేదు. వారు తమ జీవితాల ద్వారా ఆదర్శాలను స్థాపిస్తారు. వారి ఆ మూసలలో వివిధ రకాల రూపాలు తయారైతాయి. అలా మనుష్యులు తీర్చిదిద్దబడతారు. క్రమంగా జాతులు పుడతాయి- విస్తరిస్తాయి. కాల ప్రవాహంలో ఈ జాతులు నశిస్తాయి మళ్ళీ అలాంటి సంస్కర్తలే ఆవిర్భవిస్తారు. తరతరాలుగా ఎడతెగని ప్రవాహంలా ఈ వరస క్రమం ఇలాగే కొనసాగుతూ వస్తోంది.

## వర్గాలు ఉండాలి, వర్గ విద్వేషం కూడదు:

ఈ దేశంలో కావలసినన్ని వర్గాలున్నాయి. ఇప్పటికే ఎన్నో ఉన్నాయి, భవిష్యత్తులో ఎన్నో ఉంటాయి కూడా. కారణమేమంటే మనధర్మం విచిత్రంగా అది సిద్ధాంతీకరించిన సూత్రాల విశ్లేషణకై లెక్కలేనంత అవకాశాన్ని ప్రసాదించింది. ఆ సూత్రాలను విశదీకరిస్తూ అనేక ప్రక్రియలు అతి విస్తారంగా కొనసాగాయి. ఈ కృషి ఎంతగా సాగిందంటే దానికి ఆకాశమే హద్దు, ప్రకృతి వంటి ఎడతెగని కాల పరిమితి. కనుక వర్గాలు ఉండవలసిందే అంతేకాని వర్గ కలహాలు ఉండరాదు. వర్గాలు ఉండాలి, వర్గ విద్వేషం వద్దు.

ఆధ్యాత్మిక శక్తుల ఉపయోగార్థం వర్గాలు ఉండనీ. అంతమాత్రం చేత మనం కలహించుకోవలసిన అవసరం లేదే. కేవలం పైకి మాత్రమే వైవిధ్యం

తప్ప ఈ విభేదాలన్నిటికి అతీతంగా వీటన్నిటిని గుది గ్రుచ్చుతూ ఓ అందమైన సమన్వయాన్ని, సమైక్యతను సమకూర్చిన అంతఃసూత్రం ఒకటి పనిచేస్తోందని మన ప్రాచీన వాఙ్మయమంతా ఘోషిస్తోంది.

కనక అన్నివర్గాలూ సమాదరింపబడిన ఈ పునీత భారతదేశంలో ఒకవేళ వర్గకలహాలున్నాయంటే, విభిన్న వర్గాల మధ్య యుద్ధాలు చెలరేగుతున్నా యంటే, వాటి మధ్య అసూయ ద్వేషాలు పెల్లుబుకుతున్నాయంటే నిజంగా మనం మన మహనీయ పూర్వ పురుషుల వారసులమని చెప్పుకొనేందుకు సిగ్గుపడాల్సిందే.

## మన ఊతపదం స్వీకారం తప్ప బహిష్కారం కాదు:

దూర దూర తీరాల నుండి, విభిన్న కోణాలలో సముద్రాన్ని తిలకించే ప్రజలలో ప్రతి ఒక్కరికి వారి వారి దిక్చక్రానికి తగినట్లు సముద్రంలో కొంతభాగం మాత్రమే కనిపిస్తుంది. చూసే ప్రతివాడు తాను చూసేదే నిజమైన సముద్రం అంటే వారంతా సత్యమే చెబుతున్నట్లు లెక్క. కారణం అందరూ ఆ అనంత సముద్రం యొక్క భాగాలే చూస్తున్నారు. అలాగే ధార్మిక శాస్త్ర గ్రంథాలు కూడా. వాటిలో వేర్వేరుగానూ, పరస్పర విరుద్ధంగానూ కనిపించే విషయాలన్నీ సత్యమైనవే. ఎందుకంటే అవన్నీ ఆ అనంత సత్యం యొక్క భిన్న వివరణలే.

మతాలన్నీ భగవత్ సాక్షాత్కారానికై మానవాత్మ పయనించే వివిధ దశలు. ప్రతి దశ ఒక మతం అనవచ్చు. కనుక వాటిలో దేనినీ నిర్లక్ష్యం చేయరాదు. ఏ దశ కూడా చెడ్డది కాదు- ప్రమాదకారీ కాదు. అన్నీ మంచివే. శిశువు యువకుడుగా, యువకుడు వృద్ధుడుగా పరిణతి చెందినట్లే, ఒక సత్యాన్నుండి మరో సత్యంవైపు పయనిస్తున్నట్లే ఈ మతాలునూ. ఒక దశ నుండి మరో దశకు చేరక పెరుగుదల ఆగిపోయి స్థాణువుగా మారితే నిజంగా అతడు ప్రమాదకారుడవుతాడు. శిశువు పరిణామక్రమంలో వృద్ధుడు కావడానికి తిరస్కరిస్తే అతడు రోగగ్రస్తుడైనట్లే. అలాకాక నెమ్మదిగా పెరిగితే ఒక్కో అడుగు అతనిని ముందుకు నడిపిస్తూ చివరికి పరమ సత్యం చెంతకు చేరుస్తుంది. కనుక మనం దేవుని మానవరూపంలోనూ, మానవాతీత రూపంలోనూ విశ్వసిస్తాము. దానితోపాటు ఇదివరకే ఉన్న మతాలన్నింటినీ, నేడు ఉన్నవాటినీ, ప్రపంచంలో ముందుకాలంలో రాబోయే వాటినన్నింటినీ విశ్వసిస్తాము. అంతేకాదు ఈ

మతాలన్నిటి పట్ల సహనమే కాదు సమ్మతిని కూడా మనం చూపాలని విశ్వసిస్తాము.

అప్పుడు మన ఊతపదం స్వీకారం అవుతుంది, బహిష్కారం కాదు. సహనమే కాదు, సహనం ఒక్కొక్కసారి ధర్మనిందగామా మారుతుంది. అందులో నాకు విశ్వాసం లేదు. స్వీకారాన్నే నేను విశ్వసిస్తాను. నేనెందుకు సహించాలి? సహనమనే మాటలో 'నీవు తప్పు చేస్తున్నావు నాకు తెలుసు. అయినా నీవు జీవించడానికి నేను దయతో అనుమతిస్తున్నాను' అన్న అర్థం ధ్వనిస్తుంది. నీవు నేను ఇతరులను జీవించడానికి అనుమతిస్తున్నామని భావించడం ధర్మనింద కాదూ?

## విశాలమైన మత స్వేచ్ఛ

బాగా వయస్సు పండిన తర్వాతే బుద్ధుడు మరణించాడు. బుద్ధుని జీవితాన్ని ఎంతో మక్కువతో అధ్యయనం చేసిన నా మిత్రుడు ఒక అమెరికన్ శాస్త్రజ్ఞుడున్నాడు. బుద్ధుని మరణం అతనికి నచ్చలేదు కారణం అతడు శిలువ వేయబడలేదని. ఎంత అసంగతమైన భావన! ఓ వ్యక్తి మహాత్ముడు కావడానికి అతడు విధిగా హత్య చేయబడాలా? భారతదేశంలో ఇలాంటి భావాలు ఎప్పుడూ చోటు చేసుకోలేదు. బుద్ధుడు భారతదేశమంతా పర్యటించాడు. దేవీ దేవతలను నిరసించాడు, చివరకు విశ్వదైవాన్ని కూడా తృణీకరించాడు. అయినా అతడు తన వృద్ధాప్యం వరకూ జీవించాడు. 80 సంవత్సరాలు జీవితం గడిపి సగం దేశాన్ని తన మార్గంలోకి మార్చివేశాడు.

ఇక ఒక కాలంలో చార్వాకులు ఉన్నారు. మరీ భయంకరంగా, పచ్చి భౌతికవాదాన్ని బాహాటంగా వారు ప్రబోధించారు. బహుశ ఈ 19వ శతాబ్దం లోనయితే వారు సాహసించలేకపోయేవారు. ఈ చార్వాకులు ఒక గుడి నుండి మరో గుడికి, ఒక పట్టణం నుండి మరో పట్టణానికి తిరుగుతూ తమ సిద్ధాంత ప్రచారం చేయడానికి అనుమతించబడ్డారు. "మతం ఒక మూర్ఖత్వం, అది కేవలం పూజారుల వృత్తి - వారి సృష్టి వేదాలు బుద్ధిహీనులు, అనాగరికులు, రాక్షసులు వ్రాసిన పిచ్చిరాతలు. దేవుడూ లేడు, పరమాత్మా లేడు. ఆత్మ అనేదే ఉంటే ఒకసారి చనిపోయాక ఆలుపిల్లల ప్రేమబంధం చేత ఎందుకు వెనకకు మరలిరావడంలేదు?" "ఆత్మ అనేదే వుంటే అది చావు తర్వాత కూడా ప్రేమించాలి, చక్కగా భుజించాలి, దుస్తులు వేసుకోవాలి" అన్నది వారి

మతాలన్నిటి పట్ల సహనమే కాదు సమ్మతిని కూడా మనం చూపాలని విశ్వసిస్తాము.

అప్పుడు మన ఊతపదం స్వీకారం అవుతుంది, బహిష్కారం కాదు. సహనమే కాదు, సహనం ఒక్కొక్కసారి ధర్మనిందగానూ మారుతుంది. అందులో నాకు విశ్వాసం లేదు. స్వీకారాన్నే నేను విశ్వసిస్తాను. నేనెందుకు సహించాలి? సహనమనే మాటలో 'నీవు తప్పు చేస్తున్నావు నాకు తెలుసు. అయినా నీవు జీవించడానికి నేను దయతో అనుమతిస్తున్నాను' అన్న అర్థం ధ్వనిస్తుంది. నీవు నేను ఇతరులను జీవించడానికి అనుమతిస్తున్నామని భావించడం ధర్మనింద కాదూ?

## విశాలమైన మత స్వేచ్ఛ

బాగా వయస్సు పండిన తర్వాతే బుద్ధుడు మరణించాడు. బుద్ధుని జీవితాన్ని ఎంతో మక్కువలో అధ్యయనం చేసిన నా మిత్రుడు ఒక అమెరికన్ శాస్త్రజ్ఞుడున్నాడు. బుద్ధుని మరణం అతనికి నచ్చలేదు కారణం అతడు శిలువ వేయబడలేదని. ఎంత అసంగతమైన భావన! ఓ వ్యక్తి మహాత్ముడు కావడానికి అతడు విధిగా హత్య చేయబడాలా? భారతదేశంలో ఇలాంటి భావాలు ఎప్పుడూ చోటు చేసుకోలేదు. బుద్ధుడు భారతదేశమంతా పర్యటించాడు. దేవీ దేవతలను నిరసించాడు, చివరకు విశ్వదైవాన్ని కూడా తృణీకరించాడు. అయినా అతడు తన వృద్ధాప్యం వరకూ జీవించాడు. 80 సంవత్సరాలు జీవితం గడిపి సగం దేశాన్ని తన మార్గంలోకి మార్చివేశాడు.

ఇక ఒక కాలంలో చార్వాకులు ఉన్నారు. మరీ భయంకరంగా, పచ్చి భౌతికవాదాన్ని బాహాటంగా వారు ప్రబోధించారు. బహుశ ఈ 19వ శతాబ్దం లోనయితే వారు సాహసించలేకపోయేవారు. ఈ చార్వాకులు ఒక గుడి నుండి మరో గుడికి, ఒక పట్టణం నుండి మరో పట్టణానికి తిరుగుతూ తమ సిద్ధాంత ప్రచారం చేయడానికి అనుమతించబడ్డారు. "మతం ఒక మూర్ఖత్వం, అది కేవలం పూజారుల వృత్తి - వారి సృష్టి వేదాలు బుద్ధిహీనులు, అనాగరికులు, రాక్షసులు వ్రాసిన పిచ్చివ్రాతలు. దేవుడూ లేడు, పరమాత్మా లేదు. ఆత్మ అనేదే ఉంటే ఒకసారి చనిపోయాక ఆలుపిల్లల ప్రేమబంధం చేత ఎందుకు వెనక్కు మరలిరావడంలేదు?" "ఆత్మ అనేదే వుంటే అది చావు తర్వాత కూడా ప్రేమించాలి, చక్కగా భుజించాలి, దుస్తులు వేసుకోవాలి" అన్నది వారి

వాది కానేరదు. అయినప్పటికీ ఉద్దేశ్యము, లక్ష్యము మాత్రము ఒక్కటే. ప్రతివారు వారి వారి మానసిక ప్రవృత్తిని బట్టి ఎవరి మార్గాన్ని వారు అనుసరించాలి. ఈ మార్గాలన్నీ వేరు వేరైనా అవన్నీ నిజమైనవే. ఎందుకంటే అవన్నీ అదే గమ్యానికి చేరుకొంటాయి. ఒకటి సత్యమై మిగిలినవి అసత్యాలు కానేరవు. అలా ఎవరి మార్గాన్నివారు ఎన్నుకోవడమనే భక్తి భాషలో 'ఇష్టము' అంటే ఎన్నుకొన్న మార్గము అంటారు.

## మతంలోని మంచి చెడులు

ఒకే మతం ఉంటుందని, ఒకే ప్రవక్త ఉంటాడని, ఒకే భగవదవతారము అని మానవుడు భావిస్తాడు. కాని ఈ భావం సరికాదు. ఈ దైవ దూత లందరి జీవితాలను చక్కగా అధ్యయనం చేస్తే వీరిలో ప్రతి ఒక్కరికీ తాము నిర్వహించవలసిన ఏదో ఓ నిర్దిష్టమైన పాత్ర ఉందనీ, అనేక పాత్రలలో అది ఒకటనీ అర్థమవుతుంది. అన్ని పాత్రల కలయికలో సామరస్యత ఉంటుంది తప్ప ఆ ఒక్క పాత్రలో కాదు. జాతుల చరిత్రలోనూ అంతే. ఏ జాతీ తానొక్కటే ప్రపంచంలో హాయిగా ఉండేందుకు జన్మించానని చెప్పజాలదు. ఈ సత్యం ఎవరూ కాదనలేరు. అనేక దేశాల ఈ దైవీ సామరస్యతలో, సమ్మిశ్రిత సహజీవనంలో ప్రతి జాతీ ఒక పాత్ర నిర్వహించవలసి ఉంది. ప్రతి జాతికి తనదైన ఓ మహత్కార్యం, ఓ కర్తవ్యం ఉంది. అన్నీ కలిసినప్పుడే సామరస్యత సిద్ధిస్తుంది.

తనకు తాను ఎంతో ఉన్నతుడినని భావించి సహచర జీవరాసులన్నింటినీ హీన, దీన దృష్టితో చూస్తూ అహంకరించే మానవుని సహవాసములో 'సహ నశీలత' అన్నమాట వక్రీకృతమైపోయింది. ఇది ఒక భయంకరమైన మానసిక స్థితి. మనమంతా ఒకే వైపునకు, ఒకే గమ్యం కోసం భిన్న మస్తిష్కాలకు అనువైన భిన్నదిశల నుండి భిన్న భిన్న మార్గాలలో పయనిస్తున్నాం. మనము బహుమార్గాలను అవలంబించాలి. సర్వగ్రాహ్యత నలవరచుకోవాలి. దానివల్ల సహించడమే కాదు, అంత కంటే కఠినతరమైన పని- ఇంకొకరిపై సానుభూతి వహించి అతని మార్గంలో అతనితోపాటు పయనించి అతని ఆశయాలతో పరమాత్ముని సన్నిధికి చేరేందుకు అతనికి సహకరించగలగాలి.

ప్రతి మతంలోనూ మంచి, చెడు- రెండు అంశాలూ ఉన్నాయి. ఉదాహరణకు క్రైస్తవ మతంలో అవతారము, త్రిమూర్తిత్వము, జీసస్ క్రీస్తు

ద్వారా ముక్తి - ఈ విషయాల ప్రసక్తి వచ్చినప్పుడు నేనూ మీతో ఉంటాను. 'చాలా మంచిది. అవి నేనూ సత్యమని విశ్వసిస్తాను' అంటాను. కానీ 'ఇంత కన్నా మరో సత్యమతమంటూ లేదు, ఇంతకన్న భగవంతుని మరో సత్య దర్శనమూ లేదు' అంటే మాత్రం 'ఆపండి - నేను మీ వెంట రాలేను. మీ ద్వారాలు మూసుకుంటే, మీరు నన్ను వ్యతిరేకిస్తే మీతో నేను నడవలేను' అంటాను. ప్రతి మతానికి ప్రపంచానికి అందించవలసిన సందేశం ఒకటి ఉంది. మానవునికి బోధించవలసినదీ ఉంది. అయితే అది వ్యతిరేకతతో ప్రారంభిస్తే, అది ఇతరులను చిందర వందర చేయడానికి ప్రయత్నిస్తే అది చెడుగా రూపాంతరం చెందుతుంది. తుది మొదలులేని ఒక ప్రమాదకరమైన స్థితికి చేరుకొంటుంది.

భగవంతుని గ్రంథం ముగిసిందా? లేక అతని లీలలు, ప్రకటీకరణలు కొనసాగుతున్నాయా? యావద్విశ్వానికి చెందిన ఈ ఆధ్యాత్మిక ప్రకటీకరణలతో నిండిన ఆ గ్రంథం అత్యద్భుతం. బైబిలు, వేదాలు, కురాను ఇంకా మిగిలిన పవిత్ర గ్రంథాలన్నీ ఆ బృహత్ గ్రంథంలోని కొన్ని పుటల మాత్రమే. తెరిచి చూడవలసిన మరెన్నో పుటలు ఈ బృహత్ గ్రంథంలో ఇంకా అలాగే ఉన్నాయి.

## మన మాతృభూమి అనుగ్రహము - సహనము, సానుభూతి

రంగు రంగుల అద్దాల నుండి ప్రసరించేది ఒకే కాంతి. భిన్న ప్రకృతులకు తగినట్లుగా ఈ కొలది విభిన్నత్వం అవసరమే. హృదయాంతరాళాలలో మాత్రం ఒకే సత్యం విరాజిల్లుతుంటుంది. శ్రీకృష్ణుని అవతారంగా హిందువుకు ఆ భగవంతుడు ఇలా ప్రకటించాడు "నేను ప్రతి మతంలోనూ ముత్యాలసరంలోని దారం వలె ఉన్నాను. ఎక్కడెక్కడ నీకు అనన్య సామాన్యమైన పవిత్రత, అత్యద్భుతమైన శక్తి ఉత్పన్నమైన మానవ సముదాయాన్ని శుద్ధీకరిస్తూ కనిపిస్తుందో అక్కడక్కడ నేనే ఉన్నానని తెలుసుకో" ఏమిటి దీని ఫలితం? సంస్కృత తత్వశాస్త్ర గ్రంథాలన్నింటిలోనూ ఎక్కడైనా హిందువుకొకనికే తప్ప ఇతరులెవ్వరికీ ఆ దైవ రక్షణ లేదన్న భావం ఉందేమో చూపించమని నేను సమస్త ప్రపంచాన్నీ సవాలు చేస్తున్నాను. వ్యాసుడంటాడు "ఈ వర్ణాలు, సంప్రదాయాల పరిహద్దుల కావలనే పరిపూర్ణ మానవులను కనుగొనగలము" అని.

